


శబ్దబ్రహ్మాత్మికాం దేవీం భుక్తిముక్తి ఫలప్రదాం,
ప్రణమ్య స్వామి తామేవ జ్ఞానశక్తిం సరస్వతీమ్.

౯-వ సంపుటము

# గ్రంథాలయ సర్వస్వము.

౪ - వ సంచిక.

జనవరి 1935


## ఎనిమిదవ

# అఖిలభారత గ్రంథాలయ మహాసభ.

## 1934 సం॥ డిసెంబరు 24, 25, 26 తేదీలు మద్రాసు

అఖిలభారతగ్రంథాలయమహాసభ 24 నే దీన కాంగ్రెసుభవనమునసమావేశమయ్యెను. వంగరాష్ట్ర గ్రంథాలయ సంఘాధ్యక్షులగు కుమారమునీంద్ర దేవ్ రాయి (ఎం. ఎల్. సి.) గారు అధ్యక్షత వహించిరి. భారతదేశము నందలి చాలప్రాంతములనుండి పెక్కుమంది ప్రతినిధు లరుదెంచిరి.

### ఆహ్వానసంఘాధ్యక్షుని ఉపన్యాసము.

ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీయుత కస్తూరి లక్ష్మీనరసింహారావుగారు, ప్రతినిధులకు హృదయపూర్వకమగు స్వాగత మొసగుచు, అఖిలభారత గ్రంథాలయోద్యమమునకును చెన్ననగరమునకును గలసంబంధము నుదాహరించిరి. మొట్టమొదటి అఖిలభారతగ్రంథాలయ సమావేశ మీపట్టణముననే జరిగెను. అఖిలభారతగ్రంథాలయ సంఘమునకు

మొట్టమొదట నీపట్టణముననే పునాదివేయబడెను. తిరిగి 1927 సం॥ న అఖిలభారత గ్రంథాలయసభ ఈపట్టణముననే రెండవ మారు సమావేశ మయ్యెను. ఆ సమయముననే నేటివరకునుగూడ జయప్రదముగ పనిచేయుచున్న మదరాసురాష్ట్రీయగ్రంథాలయముల సంఘము స్థాపింపబడెను. ఈ మహాసభ, చెన్నపట్టణమున సమావేశమగుటకిది మూడవతూరి. రాష్ట్రీయగ్రంథాలయసమితి నేర్పరచుటకు చెన్నరాష్ట్రమే ప్రథమము. రాష్ట్రమునందలి గ్రంథాలయసంఘములన్నియునుగూడ ఈ సమితియందు చేరి బలపరుపవలెను. ఇటీవల రాజకీయపరిస్థితులవలన, మన రాష్ట్రమున, గ్రంథాలయవ్యాప్తి తగినంత జరుగుట లేదుగాని ఇటీవల పరిస్థితులు మారుటచే, గ్రంథాలయస్థాపనలందుగూడకొంత చురుకుగ పనిసాగుచున్నది. అచిరకాలములోనే పాశ్చాత్యదేశములతోసరిసమానముగ మన దేశముననుగూడ గొప్పగ్రంథాలయములు స్థాపింపబడునని నమ్మవచ్చును.

ఆహ్వానసంఘాధ్యక్షులు, గ్రంథాలయోద్యమావశ్యకత నుదాహరించుచు, విద్యాధికులలో వ్యాపించియున్న నిరుద్యోగసమస్యను, దానిని వారించుటకు గల మార్గములను చర్చించి, విద్యోపార్జనము జీవనోపాయముగ నవలంబించు స్వభావమును తొలగించి, జ్ఞానోపార్జననే పరమావధిగ నొనర్పవలెనని కోరిరి. ఇందుకు గ్రంథాలయోద్యమము చాలవరకు తోడ్పడగలదు. విద్యాలయములందు విద్యోపార్జనము, చాల వ్యయకరముగ నున్నది. అందుచే ప్రజాసామాన్యమున విజ్ఞానవ్యాప్తికి, గ్రంథాలయములు గావింపగల కృషి చాలగలదు. అచిరకాలములోనే మన దేశమున, నూతనప్రజాప్రాతినిధ్యప్రభుత్వము జయప్రదముగ నడలు జరుగవలె ననినచో, అజ్ఞానాంధకారమున మునిగియున్న ప్రజాసామాన్యమున విజ్ఞానమును వ్యాపింపజేయవలసియున్నది.

ప్రస్తుతము శాసనసభవారియెదుటనున్న గ్రంథాలయముల చట్టమును గురించి ప్రసంగించుచు, అది శాసనమగుటకు కావలసిన సాహాయ్యము నొనర్పవలసినదని ప్రభుత్వము వారిని గోరిరి.

### కే. యం. అసదుల్లాగారు సమావేశప్రారంభము గావించుట.

కే. యం. అసదుల్లాగారు సమావేశప్రారంభోత్సవము సలుపుచు, ఇట్లు పలికిరి.

గ్రంథాలయ ఉద్యమము వర్తమానకాలమున విద్యాభివృద్ధికిని, ప్రజల విజ్ఞానాభివృద్ధికిని ముఖ్యముగ తోడ్పడుచున్నను, ఉద్యమము అనుకొనినంత ప్రాముఖ్యము బడయకుండుట విచారకరము. అచ్చటచ్చట విరివిగా గ్రంథాలయములను స్థాపించి వానిని నిర్వహించుట చేయవలసినపనులలో అవశ్యమైనది. భారతదేశమున విద్య యితరదేశములతోపాటు అభివృద్ధి గాంచియుండకపోయినను ఉన్న విద్యావంతులైనను స్థాపింపబడినగ్రంథాలయములను ఎక్కువ ఉపయోగించుకొనుట లేదని చెప్పవలెను. గ్రంథాలయ ఉద్యమమును ప్రచారింపజేయుట తమ ముఖ్యకార్యమైయున్నను విద్యావంతులైన ప్రజలలో గ్రంథాలయములను వాడుకొనెడి వాంఛను కలిగింపజేయుట ఆవశ్యకము. ఇందుకు

గాను గ్రంథాలయసంఘములనధికముగస్థాపించుట, సమావేశములు జరుపుట యవసరము.

గ్రంథాలయముల నిర్వహణము, అందులకుగాను శిక్షణము పొందినవారిచేతిలో నుండవలెను. గ్రంథభాండాగారులకు శిక్షణమొసగ ప్రత్యేకపాఠశాలలు స్థాపించి వారికి తగిన శిక్షణ మొసగవలెను. ఇవియును మరి అనేక సమస్యలు పరిష్కరించుటకు గ్రంథాలయసంఘము లన్నియు శ్రద్ధ వహింపవలెనని కోరుచున్నాను.

### అధ్యక్షోపన్యాసము.

కుమార మణీంద్రదేవ్ రాయిగారు, అధ్యక్షత వహించుచు ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము గాంచిన వ్యాప్తిని ప్రశంసించిరి. ప్రాచీనకాలమున నళందా, విక్రమశిల, తక్షశిలానగరములందు గల గొప్ప గ్రంథాలయముల నుదాహరించి ఆదర్శమందు నాటిగ్రంథాలయములకును, నేటి గ్రంథాలయోద్యమమునకును గల భేదములను వివరించిరి. నాటిగ్రంథాలయములు విద్యార్థుల నుద్దేశింపబడినవి. నేటిగ్రంథాలయోద్యమము, జనసామాన్యమందంతను విజ్ఞానమును వ్యాపింపచేయుటకు యత్నించుచున్నది. ప్రజాసామాన్యమున గ్రంథపఠనాభిమానము వ్యాపింపచేయుట నుద్దేశింపబడినది.

కలకత్తాయందలి "ఇంపీరియల్" గ్రంథాలయమును, భారతదేశమున కంతకును కేంద్రగ్రంథాలయముగ నొనర్చుటకు గావింపబడుచున్న ప్రయత్నములు సఫలముగుగాక! యని ఆశించిరి. నూతన గ్రంథాలయముల స్థాపనమునుగురించి ప్రసంగించుచు, ఆయా స్థానిక పరిస్థితుల కనుకూలమగు పద్ధతులపై గ్రంథాలయములను స్థాపింపవలెనని నుడివిరి. ప్రభుత్వమువారు, సార్వభౌముని పరిపాలనా రజతోత్సవమును జరుపునపుడు దాని సంస్మరణార్థము కొన్నిగ్రంథాలయముల నేర్పరుపవలెనని హెచ్చరించిరి. ప్రజలు గ్రంథాలయముల నేర్పరుచుకొనుటలోను, గ్రంథాలయోద్యమములోనికి పాక్షిక విరోధముల నేమాత్రమును దరికి చేరనీయరాదనిరి. గ్రంథాలయములు, అవసరములనుబట్టి, గ్రంథములను పరస్పరము బదులిచ్చి పుచ్చుకొను పద్ధతి నవలంబింపవలెననిరి. కారాగారములలోని ఖయిదీలకును, వైద్యశాలలలోని రోగులకును, పామరజనులకునుగూడ ప్రత్యేకముగ గ్రంథాలయముల నేర్పరుచుట అవసరమనిరి.

### రెండవదినము.

రెండవదినముఉదయమున అధ్యక్షులందరును కలిసి, మద్రాసునందలి గ్రంథాలయముల నన్నింటిని దర్శించిరి. మధ్యాహ్నమున తిరిగి సభ జరిపి తీర్మానములను గావించిరి.

### తీర్మానములు.

అన్ని రాజధానులలోను ధర్మగ్రంథాలయోద్యమమును వ్యాపింపజేయుటకు వివిధ రాష్ట్రములందలి చట్టనిర్మాణసభలు విశేషధనము నొసంగవలెనని యీసభవారు కోరుచున్నారు.

స్థానికసంస్థలును, పురపాలకసంఘములును తమపరిపాలనక్రింద ధర్మగ్రంథాలయములను స్థాపింపవలెనని యీ సంఘమువారు తీర్మానించుచున్నారు.

ధర్మగ్రంథాలయోద్యమమును వ్యాపింప జేయుటకు గాను జిల్లా, తాలూకా గ్రామ గ్రంథాలయసంఘములు నెలకొల్పవలసినదని యీ సభవారు హెచ్చరించుచున్నారు.

చదువుకొన్నవారికి, చదువురానివారికి జనసామాన్యమందంతట విజ్ఞానవ్యాప్తి గలుగుటకును, గ్రంథాలయోద్యమము అందరి ఉద్యమములను నడుపవలసినదని గ్రంథాలయముల పరిపాలకులను హెచ్చరించుచున్నారు.

గ్రంథాలయసంఘములతో కలిసి పని జేయుటకు, వానిని పరిపాలించుటకును రాష్ట్రీయసంఘములను నిర్మించి, వానిని అఖిలభారతగ్రంథాలయసంఘమునకు శాఖలనుగా చేర్చవలసినదని, ఈ సభవారు హెచ్చరించుచున్నారు

జనసామాన్యముయొక్క విద్యావ్యాపనమునకై దేశభాషాగ్రంథములను స్వీకరించి వానిని వ్యాపింపజేయుటకుగాను గ్రంథాలయములు విశేషప్రాముఖ్యమును నొసంగవలెనని యీ సభవారు తీర్మానించుచున్నారు.

హిందూదేశమునందటను ప్రచురింపబడుచున్న వాఙ్మయము నంతను వివిధ రాష్ట్రీయ గ్రంథాలయములందును, ఇంపీరియలు గ్రంథాలయమునందును చేర్చియుంచుట అత్యంతావశ్యకము గావున వానికి అన్నిగ్రంథములను ఉచితముగాను, నిర్బంధముగాను తెప్పించుకొనునధికారము నొసంగుట అవసరము.

గతరెండుసంవత్సరములందును గ్రంథాలయవారము జయప్రదముగా నిర్వహించినందులకు ఈసభవారు తమసంతసమును దెల్పుచు, సరస్వతీపూజలు, సభలు, ప్రదర్శనములు- స్థానికగ్రంథాలయములసాహాయ్యార్థము సొమ్మువసూళ్ళు-ఇంకను గ్రంథాలయోద్యమవ్యాప్తికి కావలసిన ఇతరకార్యక్రమములను నిర్వహించి, ఆ వారమును ప్రతిసంవత్సరమును జరుపవలెనని యీ సభవారు హెచ్చరించుచున్నారు.

మన్నారుగుడి, కొప్పము, ఆలమూరులందు జరుగుచున్న గ్రామ గ్రంథాలయసేవకు ఈ సభవారు తమ యామోదమును దెల్పుచు ఆరీతిగానే దేశము నెల్లెడలను చేయవలెనని ఈ సభవారు కోరుచున్నారు.

(క) పట్టణములందును, పల్లెలయందును గ్రంథాలయములను వ్యాపింపజేయుటతోమాత్రము సంతుష్టినొందక కంటికి చూపుట, చెవికి వినిపించుటమూలమున చదువుకొన్నవారికి, చదువుకొనివారికి అందరికి జ్ఞానవ్యాప్తిని చేయవలెనని ఈసభవారి యభిప్రాయము.

(చ) భారతీయవిజ్ఞానముయొక్క ఘనతను గూర్చియు, వానియొక్క ఉపయోగమును గూర్చియు ఆంగ్లేయవిద్యాధికులకు తెలియజెప్పవలెనని ఈసభవారు హెచ్చరించుచున్నారు.

(ట) పై అభిప్రాయములను ఆచరణలో పెట్టుటకై ఈ క్రిందివారిని ఉపసంఘముగా నియమించిరి.

యస్. యస్. రాజగోపాలం, యం ఏ.బి.ఎల్

దాసు త్రివిక్రమరావుగారు, బారిష్టరు, సమావేశకులు.

కుమార మణీంద్రదేవ రాయి, అధ్యక్షులు.

కే. యం అసదుల్లా.

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు

అయ్యంకి వేంకటరమణయ్య.

డాక్టరు బి. వి. నారాయణస్వామి, బారిష్టరు.

కే. యల్. నరసింహారావుగారు బి ఏ., బి. యల్.

రావుసాహేబు యస్. వి. కనకసభాపిళ్లే, వి. వి. గిరి, బారిష్టరు. పురుషోత్తముగారు.

(త) విద్యార్థులకును యువకులను గ్రంథాలయోద్యమవ్యాపకనమునకై వినియోగించుటకు తగిన ప్రణాళికలను తయారుచేసి రాష్ట్రీయప్రభుత్వములకు పంపవలెను. అంతర్జాతీయగ్రంథాలయసభను భారతవర్షమున జరుపుటకై ఈసభవారు ఆహ్వానించుచున్నారు.

ప్రభుత్వమువారు కొన్నిగ్రంథాలయములకు వారిప్రచురణములను ఉచితముగా ఇచ్చుచున్నందులకు ఈ సభవారు వందనము లర్పించుచు, అన్నిగ్రంథాలయములకును ఇప్పించవలెనని కోరుచున్నారు.

గ్రంథభాండాగారులను తరబీతు చేయుటకై శిక్షాతరగతులను ఏర్పాటు చేసినందులకు ఈ సభవారు తమసంతుష్టిని గన్పరచుచు, దానిని ఇంకను ఎక్కువగా అభివృద్ధి పరచుటకు హిందూదేశమునందును, బర్మాయందును గల విశ్వవిద్యాలయము లన్నియు తగిన తరగతులను పెట్టవలెనని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

అఖిలభారత గ్రంథాలయసంఘమును, భారత గ్రంథాలయసంఘమును కలిసి పనిచేసిన యెడల, ఉద్యమము ఇంకను ఎక్కువ జయప్రదముగా వ్యాప్తియగును గావున, అట్టి పనికిగాను మార్గముల నన్వేషింపవలెనని యీ సభవారు, ఉభయసంఘముల కార్యనిర్వాహకవర్గములవారిని కోరుచున్నారు.

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారును, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారును, గ్రంథాలయోద్యమమునకు చేయుచున్న సేవను గుర్తించి, వారి కీసభవారు ఈక్రింది బిరుదముల నిచ్చి సత్కరించుచున్నారు.

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు జ్ఞానదాత

వావిళ్ల వేంకటేశ్వర్లుగారు, ఆంధ్రభాషోద్ధారక

లాహోరు గ్రంథాలయసేవకులగు ఏ. కే. సిద్ధాంతగారి అకాలమరణమున కీ సభవారు తమవిచారమును దెల్పుచున్నారు.

విందులు.

ప్రతినిధులకు **24** వ తేదీని సెంటులైబ్రరీవారును, **25** వ తేదీని దివాన్ బహద్దరు, జి. నారాయణస్వామిగారును అల్పాహారవిందును గావించిరి.

---

# రేపల్లెతాలూకా గ్రంథాలయ మహాసభ

పెదపులివర్రు **15—11—34.**

**14** వ నవంబరు మధ్యాహ్నమున **2** గం॥లకు రేపల్లెతాలూకా ద్వితీయగ్రంథాలయ మహాసభ ఆంధ్రరాష్ట్రీయగ్రంథాలయసంఘ కార్యదర్శిగారగు శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారియధ్యక్షతక్రింద పెదపులివర్రు బాలగంగాధరతిలక్ పుస్తక భాండాగారపు త్రయోదశ వార్షికోత్సవముకొరకు వేయబడినపందిరిలో జయప్రదముగా జరుగ

బడెను. తాలూకాలోని వివిధ గ్రంథాలయ ప్రతినిధులు పలువురు విచ్చేసిరి. రిటైర్డు డిప్యూటీ కలెక్టరుగారగు రావుసాహెబు శ్రీయుత వట్టెంభొగప్పయ్యశాస్త్రిగారిచే మహాసభా కార్యక్రమము ప్రారంభింపబడెను.

వి. యల్. శాస్త్రిగారు, గ్రంథాలయోద్యమమును గూర్చి గంభీరోపన్యాసము నొసంగిరి.

ఏడిద వీరభద్రరావు పంతులు బి. ఏ., బి. యల్., గారు గ్రంథాలయోద్యమమును గూర్చి విపులముగా ముచ్చటించిరి. బీరువాలలో గ్రంథము లుండిన ఉపయోగము లేదనియు గ్రంథ రాజములను ఉపయోగింపచేయుట స్త్రీపురుషులకు ముఖ్యావసరమనియు సెలవిచ్చిరి.

## అధ్యక్షోపన్యాసము.

తరువాత అధ్యక్షులవా రుపన్యసించుచు గ్రంథాలయోద్యమము భీమవరము తాలూకాలోను, రేపల్లెతాలూకాలోను ఎక్కువగా కొనసాగుట ప్రశంసనీయమని సెలవిచ్చిరి. నవీన కాలములో గ్రంథాలయములు, గ్రంథములు పోగుచేయబడిన దుకాణములు కావనిరి. గ్రంథాలయములోని పుస్తకములు చదువకుండ నుండిన ఇంపీరియల్ బ్యాంకులో డబ్బున్నట్లే యని చెప్పిరి. మరియు, పాశ్చాత్య దేశములలో విజ్ఞానవ్యాప్తి నింకను ఎక్కువ త్వరితగా సాగించుటకై గ్రంథములను గ్రామఫోనులయందెక్కించి వినుపించుచున్నారని, గుడ్డివారికి కూడ ఈపద్ధతి మిక్కిలి యుపయోగముగా నున్నదనియు ఒక గ్రామమందలి జనులందరును గ్రంథాలయముయొక్క ఉపయోగమును పొందుచున్న గాని దేశమునకు మోక్షము లేదనియు జెప్పిరి.

## తీర్మానములు.

తదుపరి మహాసభలో ఈదిగువ తీర్మానములు పెట్టబడి యేకగ్రీవముగా నామోదింపబడెను.

1. ఈ తాలూకాలోని అడవులదీవి గ్రంథాలయ కార్యదర్శియగు కాజ వెంకట నరసింహారావుగారును, శిరిపూడి గ్రంథాలయాధ్యక్షులగు యల్లాప్రగడ జగన్నాథరావుగార్లు నిర్యాణములకు చింతిల్లుచు వారియాత్మలకు శాంతి కలుగుగాక యని యీ సభవారు ప్రార్థించుచున్నారు.

2. ఈ తాలూకాలోని గ్రంథాలయములు లేని గ్రామములవారు తాలూకా గ్రంథాలయ సంఘమువారి సలహాలను తీసికొని వారిగ్రామములలో నూతన గ్రంథాలయములను స్థాపించుటకు హెచ్చరించుట యైనది.

3. మాసవారీ నివేదికలను పంపుటలో అశ్రద్ధ వహించు గ్రంథాలయములవారు కడు శ్రద్ధతీసికొని ప్రతి నెల 5 వ తేదీలోగా నివేదికలను తాలూకా సంఘమువారికి పంపగలందులకు కోరుట యైనది.

4. దసరా పండుగ దినములలో గ్రంథాలయ మహోత్సవమును ప్రతిగ్రంథాలయ నిర్వాహకులును జరిపింపగలందులకు కోరుటయైనది.

5. తృతీయ రేపల్లె తాలూకా గ్రంథాలయ వార్షిక మహాసభను ఇలవరం శ్రీ శారదా గ్రంథనిలయమువారు తమనిలయమున జరిపించుటకు ఆహ్వానించునందున ఆహ్వానమును అంగీకరించుట యైనది.

---

# హిందూయువజన సంఘము, ఏలూరు

## 29 వ వార్షికోత్సవము.

ఈగ్రంథాలయముయొక్క వార్షికోత్సవము 21-10-34 తేదీన యం. లక్ష్మీనరసప్ప, యం. ఏ., ట్రెజరీ డిప్యూటీ కలెక్టరుగారి అధ్యక్షతక్రింద మిక్కిలి వైభవముగా జరిగినది. అప్పుడు చదువబడిన గ్రంథాలయము యొక్క నివేదికను ఈక్రింద వివరించుచున్నాము

సంఘ చరిత్ర.

ఈ సంఘము 30 సంవత్సరముల క్రితము ది 23-9-1904 వ తేదీని ఉత్సాహవంతులగు యువకులచే ఏలూరు దక్షిణపువీధిని స్థాపింపబడెను. ఈసంస్థాపనము చేసిన అభ్యుదయాస్పదుడగు కీ. శే దుగ్గిరాల సత్యనారాయణమూర్తిగారి సేవ ఈ గ్రంథాలయజీవనమునకు శ్రీకారమయినది. ఆయన మనకెల్లరకు చిరస్మరణీయుడు. ది 6-11-1918 సం॥న ఈసంఘము రిజిష్టరు చేయబడెను. వితరణశీలుడును, వినయభావుడును, ధర్మకర్త బాధ్యతలు వహించినవారగు రా॥ బ॥ మోతే గంగరాజు జమీందారుగారు ఏబది వేలరూప్యములు వెచ్చించి 1929 సం॥న ఈ దివ్యభవనమును దానమొసంగి తమ ఔదార్యమును ప్రకటించెను.

పరీక్షలు:- ఈసంఘపక్షమున 6 వతరగతి మొదలు 11వ తరగతివరకు విద్యనభ్యసించుచున్న బాలబాలికలకు వ్యాసరచనాపోటీ పరీక్ష జరుపబడెను. 178 బాలురు 2 బాలికలును హాజరు అయిరి.

నీతిదాయకమగు నొకకథ - వ్యాయామము - విద్యార్థులు, వారివిధులు - గ్రంథపఠనము - కాలవిభాగము - సంఘసేవ - అనువిషయములందు పరీక్షింపబడినది; పదునొకండు బాలురకును, ఒక బాలికకును బహుమతులియ్యబడెను.

ఉపన్యాసములు.

ఈవత్సరమున 6 ఉపన్యాసము లిప్పించబడినవి.

విజ్ఞప్తి

గ్రంథాలయాభివృద్ధికి ధనము ముఖ్యావసరము. కనీసము ఒకలక్ష రూప్యములైనను కావలెను. సంఘమునకు, వచ్చుఆదాయమునకు మించిన వ్యయమగుచున్నది. సంఘమునకు [illegible] గ్రంథరాజములను కొనుటకు ధనము చేకూరుటలేదు. అందుచే విరాళములను ధారాళముగా ప్రసాదింతురని విశ్వసించుచున్నాము.

ఈ సంఘమున 1933 సంవత్సరాంతమువరకు 365 సభ్యులు గలరు. 11,986 గ్రంథములు గలవు.

రు500/లు ఇచ్చిన శాశ్వతధర్మకర్తలు 33రును, అంతకంటె తక్కువ మొత్తము నిచ్చినవారు 42 రును గలరు. శాశ్వత ధర్మకర్తలు ఇచ్చిన సొమ్ముమీద సాలుకు రు1,000/లు ఆదా వచ్చుచున్నది.

పత్రికలు:- ఆరు దినపత్రికలు, పండ్రెండు వారపత్రికలు పండ్రెండు మాసపత్రికలును వచ్చుచున్నవి.

రు 204-4-0 విలువగల 367 గ్రంథములు దాతలవలన ఇయ్యబడినవి.

ఆదా:- ఈవత్సరము ఆదా రు 5891-11-6 లు. వ్యయము రు 5882 లు.

# 17 వ ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభ

**24, 25 డిసెంబరు, 1934**

17 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ డిసెంబరు నెల **24** వ తేదిన సాయంకాలము మద్రాసునగరమున కాంగ్రెసుమందిరమున సమావేశమయ్యెను.

అన్నామలై విశ్వవిద్యాలయమందు అర్థశాస్త్ర పండితులగు డాక్టరు బి. వి. నారాయణస్వామిగారు ఈక్రింది ప్రారంభోపన్యాసమిచ్చిరి.

మన దేశమున ప్రజలవిద్యావిహీనత బ్రహ్మాండమగు సమస్యగ నున్నది. దీనిని నివారించుటకు నిరక్షరాస్యులను అక్షరాస్యులనుగ నొనర్పవలసియున్నది. అల్పవిద్యారంభకులగు ప్రజలు దానిని మరచిపోయి తిరిగి అవిద్యాంధకారమున బడిపోకుండ కాపాడవలసియున్నది. కాయకష్ట మొనర్చి జీవనోపాధిని సంపాదించుకొనవలసియున్న వ్యవసాయకులకును, ఇతర పాటకజనసామాన్యమునకును, పాఠశాలల కరిగి విద్యాభ్యాసమొనర్పగల శక్తిగాని, సావకాశముగాని లభ్యముకాదు. అట్టివారికి వినోదకరములును ఉత్సాహజనకములును అగు గ్రంథములు, గ్రంథపఠనమునందభిరుచిని గలిగించి విద్యోపార్జనాసక్తుల నొనర్పగలవు. విద్యాభ్యాసమునకు రాత్రిపాఠశాలలకుగాని, ఇతర ప్రయోజనవిద్యాశాలలకు గాని చనువారికవి మరింత ప్రోత్సాహకరముగ నుండగలవు. కొద్దికాలములోనే మన దేశమున గొప్ప రాజ్యాంగసంస్కరణలు ప్రారంభింపబడుచున్నవి. ఆసంస్కరణలు జయప్రదమగుటకు వోటరులు, వ్యవహారపరిస్థితులనెరిగి, దేశీయ సమస్యల బాగుగ దెలిసినవారై యుండవలెను. అప్పుడుగాని వారు, తమవోటింగు హక్కును వివేకముతో నుపయోగింపజాలరు. ప్రజలలో విద్యావ్యాప్తి కలుగుటవలన, పరిశ్రమలును, పరిశ్రమలయందలి కార్మికుల శక్తిసామర్థ్యములును అభివృద్ధి గాంచును. ఆవిధముగ గ్రంథాలయోద్యమము, దేశపారిశ్రామికాభివృద్ధికి గూడ చాల సాహాయ్యమొనర్పనగును. విద్యావంతులగు ప్రజలు, తమపౌరవిధులను పౌరధర్మములను, పారిశుద్ధ్యవిధులను బాగుగ గుర్తెరుంగగలరు. ఈ విధముగ ప్రజలు తమ రాజకీయ బాధ్యతల గూడ సరిగ నిర్వహించుకొనగలరు. ప్రపంచమునందలి నాగరక దేశములన్నిటియందును ప్రజలిప్పుడు, గ్రంథాలయోద్యమముయొక్క ప్రాముఖ్యమును బాగుగ గుర్తించియున్నారు. ఆంగ్లదేశమున నూరుసంవత్సరములకు పూర్వమే గ్రంథాలయోద్యమము ప్రారంభింపబడెను. అప్పటినుండియు ప్రభుత్వసాహాయ్యముతోడను, ప్రజల ఉత్సాహ కార్యదీక్షలవలనను గ్రంథాలయోద్యమ మాదేశమున బాగుగ వ్యాపించెను. గతశతాబ్దమందు రెండవయర్ధభాగమున నార్వే, స్వీడన్, డెన్మార్కు, ఫ్రాన్సు, జర్మనీ దేశములు ప్రజోపయోగమునకుగాను గొప్ప గొప్ప గ్రంథాలయములను

స్థాపించెను. కాని స్కాట్లండు దేశమున నీయుద్యమ మందిన వ్యాప్తి చాల ఆశ్చర్యకరము. అచట ప్రతిగ్రామమునందును, బట్టణమందునుగూడ అనేక గ్రంథాలయములు గలవు.

"మన దేశమున అఖిలభారత గ్రంథాలయ సంఘమును స్థాపించుటలో మనవారు చాల దూరదృష్టిని గన్పరచిరి. ఇందువలన నిక నీ దేశమం దన్ని ప్రాంతములలోని గ్రంథాలయములను ఏకముఖము నపనిచేయగలవు. ఈయుద్యమవిజయమునకు, ప్రజల యుత్సాహము కార్యదీక్ష, ధనికులఔదార్యము, ప్రభుత్వమువారి చట్టసహాయము అన్నియుగూడ అవసరము. ఈయుద్యమమును వ్యాపింపచేయు కార్యము, ఉత్సాహపరులును, సమర్థులును అగు యువకులకప్పగింపవలెను. గ్రంథాలయములను ప్రజాసామాన్య విద్యాసంస్థలుగ బరిగణించి వానిని నిర్వహించు భారమును స్థానికసంస్థలును, పురపాలక సంఘములును రాష్ట్రీయ ప్రభుత్వములును వహింపవలెను. మదరాసు పబ్లికు లైబ్రరీల చట్టమువంటి శాసననిర్మాణమందుకు చాలతోడ్పడగలదు. ఆ చట్టసహాయమున జిల్లా గ్రంథాలయసంఘములును, తాలూకా గ్రంథాలయ సంఘములును ఏర్పరుపబడును. ఒక్కొక తాలూకాయందలి ప్రాంతమునందలి గ్రామము లన్నిటియందును, స్థానిక గ్రంథాలయములుగాని సంచార గ్రంథాలయములుగాని ఏర్పరుచుటకును, ఉపన్యాసములను, ప్రదర్శనములను నేర్పరుచుటకును తాలూకా సంఘములును చాలవరకు కార్యభారము వహింపగలవు. చెన్నపట్నమువంటి పెద్దనగరములలో, ప్రతి డివిజనునకును అధమమొక్క గ్రంథాలయమైన నుండవలెను. ప్రజలచటకు వచ్చి వార్తాపత్రికల పఠించుటకును, స్వల్పమొత్తమును ధరావతుచేసి, గ్రంథముల నెరువుతీసుకొని వెళ్ళి చదువుకొనుటకును ఏర్పాటులు జరుగవలెను. ఈయుద్యమమున ఔదార్యవంతు లెల్లరును చాల తోడ్పడగలరు. అమెరికా దేశమున కార్నీజీవంటి యుదారులీయుద్యమమున కొనర్చిన సాహాయము జగత్ప్రసిద్ధము. మన దేశమునగూడ ధనికుల ఔదార్యమీయుద్యమమునకు చేయూత యగునుగాక! విశ్వవిద్యాలయములుగూడ గ్రంథాలయనిర్వహణమునందు శిక్షణము నేర్పరచి, చాలవరకు తోడ్పడగలవు. మనరాష్ట్రమున ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ మీయుద్యమమున కమూల్యమగు సాహాయ్యమొనర్చుచున్నది. ఆసంఘము దినదిన ప్రవర్ధమానమై ఆంధ్రదేశమున విజ్ఞానకాంతుల వెదజల్లుగాక."

రెండవదినము.

25 వ తేదీ మధ్యాహ్నమున తిరిగి సభ సమావేశమయ్యెను. ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారు ఈక్రిందరీతిని ఉపన్యాసమిచ్చిరి:—

### ఆహ్వాన సంఘాధ్యక్షులగు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి ఉపన్యాససారము.

గడచిన దినమందు అఖిలభారత గ్రంథాలయ మహాసభ జరిగియుండె ననియు, అందు ప్రసిద్ధులైనవార లనేకులు పాల్గొనియుండిరనియు, నాడు ఆంధ్ర గ్రంథాలయ మహాసభకు పల్లెటూరిప్రజ లనేకులు ప్రతినిధులుగా నరుదెంచి రనియు, 1885 సం॥ నుం

డియే మన దేశములో గ్రంథాలయోద్యమము ప్రారంభమైన దనియు, అస్వతంత్రమగు దేశమునందు ఇట్టియుద్యమములు కొనసాగుట కనేకములైన అంతరాయము లుండు ననియు, ఇట్టియుద్యమములు స్వప్రయత్నముపై గాని, లేక పరావలంబనమువలన గాని ఈ రెండుమార్గములలో నేదేని యొకదానివలన జరుగవలెననియు, మన పాలకుల యొక్క సాయమును మన మాశింతుమేని వారు నిర్ణయించువిధినిషేధముల కన్నిటికిని లోబడి వర్తింపవలెననియు వివిధరాష్ట్రములందును ప్రభుత్వమువారు వేర్వేరు శాసనములను కావించియున్నా రనియు, ప్రభుత్వసాహాయ్యమును బొందుచు, అట్టి శాసనముల నతిక్రమించినచో అసంస్థ అక్రమసంస్థ యగు ననియు, ఆంధ్రదేశములో ప్రభుత్వమువారి ఆదరణ లేకయే, ప్రజలు, యువకులును ఈ యుద్యమము నింతవరకు పోషించుచు, తమ వ్యక్తిత్వమును నిలుపుకొనుచున్నా రనియు, గ్రంథాలయస్థాపనయనగా గొప్ప కట్టడములు, అద్దముల బీరువాలు, వేలకొలది పుస్తకములను సేకరించుటయేయని తలంపరాదనియు, ఉన్న గ్రంథములు కొలదియైనను అయ్యది ప్రజలవిద్యావ్యాప్తికి, విజ్ఞానోదయమునకు తోడ్పడునట్లుగా చూడవలెననియు, దేహమే దేవాలయము, జీవుడే దేవుడు, అజ్ఞానమే చీకటి యని పెద్దలు చెప్పిరనియు, కావున అజ్ఞానాంధకారమును పోద్రోలవలె ననియు, లక్ష్యము సమున్నతమైయుండు టవసర మనియు, ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమమున కవకాశమును, అభ్యుదయమును కల దనియు, ఐనను ఈ యుద్యమమును ఏకముఖముగా క్రమమైన పద్ధతులపై నడుపవలసిన భారము ఉద్యమ నిర్వాహకులపై కల దనియు రాజకీయములతో నీ యుద్యమమున కెట్టిసంబంధమును లేదనియు పల్కిరి. వివిధప్రాంతములనుండి సభ కరుదెంచిన ప్రతినిధులకు మనఃపూర్వక స్వాగతమును సమర్పించిరి.

## దాసు త్రివిక్రమ రావుగారి అధ్యక్షోపన్యాసము.

పిమ్మట శ్రీ దాసు త్రివిక్రమరావుగారు అధ్యక్షత వహింపవలెనని సి. వి. రంగం శెట్టిగారు, దశిక సుబ్బయ్యగారు గుబిలు సుందరేశనుగారు ఉపపాదించినపిమ్మట శ్రీ త్రివిక్రమరావుగారు ఈ క్రింది ఉపన్యాస మిచ్చిరి:—

గ్రంథాలయోద్యమమునకు సేవచేయుటయం దాసక్తుడనై యున్న నన్ను మీ రీ సభకు అధ్యక్షునిగా నియమించినందులకు నేను మిక్కిలి సంతసించుచున్నాను. ఈ ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ మేర్పడినపిమ్మట నీ 20 యేండ్లలోను ఆంధ్రదేశవాఙ్మయవిజ్ఞానచరిత్రలో చాలముఖ్యవిషయములు జరిగినవి. గ్రంథాలయములద్వారా సమస్త ప్రజలలోను విజ్ఞానాభివృద్ధిని కలిగించుటకు యత్నింపబడెను. ఇది ఎంతవరకు సఫలమైనదో చరిత్రకారులే వివరింప నర్హులు.

తెలుగుభాషను మాట్లాడునట్టి రెండుకోట్ల మంది ప్రజలలోను 1920 నుండి 100 కి 100 వంతున చదువుకొనినవారిసంఖ్య అధికమగుటయేగాక దేశాభివృద్ధికి సహాయకములగు నన్ని ఉద్యమములతోను ప్రజలకు సంబంధము

కూడ చాల అధికమైనది. ఆంధ్రభాషలో చాల పత్రికలు బయలు దేరినవి. చవుక రకము గ్రంథములు చాల వెలువడినవి. ముద్రాశాలలు చాల హెచ్చినవి. స్త్రీలును పురుషులును గూడ గ్రంథములను మిక్కిలి హెచ్చుగా చదువుచున్నారు. ప్రజలలో విజ్ఞానప్రబోధము సాంఘిక రాజకీయ, మత, సారస్వతాది సకల విషయములలో గూడ స్థిరముగా నేర్పడినది.

భారతజాతీయత ప్రబలతమము. దానివికసన మన్ని విధములుగా గోచరించుచున్నది. ఈజాతీయోద్యమమున కనుబంధమగు గ్రంథాలయోద్యమాభివృద్ధికి కొందరు ఆంధ్రదేశమున తమ జీవితములను వినియోగించుచున్నారు. ఇటీవల ప్రారంభింపబడిన సంఘసంస్కరణోద్యమము లన్నిటిలోను నిది ప్రబలతమము. వీరు దీనికి ప్రారంభకులు. శ్రీయుతులు సూరి నరసింహశాస్త్రి, అయ్యంకి వేంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, వి. వి. శ్రేష్ఠి, నాళం కృష్ణారావుగార్లు మున్నగువారు పెక్కుమంది గ్రంథాలయోద్యమాభివృద్ధి కత్యధికముగా కృషిసలుపుచున్నారు.

ఈ యుద్యమము బాగుగా కొనసాగినచో మన దేశమునందలి కోట్లకొలది ప్రజలస్థితి చాల అభివృద్ధి నొందును. కాన నిది ముఖ్యమగు ప్రజాసేవయే యగును. ఐరోపా మహాసంగ్రామము ముగిసిన పిమ్మట కొంత కాలము వరకు ప్రపంచమున శాంతి కలుగకపోవుటచే ప్రపంచమునం దంతటను విజ్ఞాన, రాజకీయ, ఆర్థికాదివిషయములను గూర్చి ప్రబలతమమగు నాందోళనము తల సూపినది. వివిధదేశములవారు కలిసి ఆలోచించి పని చేయుటకు అవసరమగు సమత్వమును కలిగించుటకు చాలమంది నిరంతరాయముగా పని చేయుచున్నారు. ఒకరి నొకరు చంపుటకు మాత్రమేగాక నూతనవిధమగు స్వాతంత్ర్యము బడయుటకుగూడ వివిధజాతులవారు తపించుచున్నారు. ఈనాటకమునందు మనముగూడ చాలఆసక్తిని కలిగియున్నాము. ఏలననగా మన భావిచరిత్రకు మార్గదర్శక మగునని పవిత్రభావమును మనము కాపాడుకొన గోరుచున్నాము. భావికాలమున ధర్మసమ్మతమగు సాంఘికవిధాన మేర్పడ గలదని తలంచుచున్నాము. దానిలో మన సాంఘిక ఆశయములును, ఆధ్యాత్మికరత్నములును చేర్పబడగలవు. అట్టి విఖ్యాతమగు నాగరకత యొక్క లాభమును మనముగూడ పూర్తిగా బడయ గోరుచున్నాము. కాని అతినీచములు, హానికరములు అగు సాంఘికదురాచారములను ముందుగా మనము తొలగింపవలసియున్నది. ఈ విషయమున గ్రంథాలయోద్యమము చాల పనిచేయవలెను. సత్యనిరతులై వివేకముతో పనిచేయుచు ధర్మనిరతులగు పౌరులుగా నుండి మానవసేవ చేయగల్గునట్టి స్త్రీలును, పురుషులును చాలమంది యేర్పడుటకు తగినవిధానమును ఈ ఉద్యమనాయకులు సిద్ధపఱుపవలెను. సంఘమునకు మేలు కలుగు నిమిత్తము వ్యక్తులు స్వార్థత్యాగ మొనరించుట ముఖ్య సిద్ధాంతము. అటుపైని సంఘమునందు అన్ని తెగలవారికిని సరియైన న్యాయము జరుగవలెను. ఇపు డున్న అగ్ర అంత్య విభేదము లంతరించవలెను. ప్రస్తుతము మన దేశమున సాంఘికసమస్య క్లిష్టరూపమును దాల్చినది.

సంఘసంస్కరణము చేయవలెననిన విద్యావిధానములో గూడ మార్పులు జరుగవలెను. జాతీయబాధ్యతలను గుర్తించిన దేశములవారు అతిశీఘ్రముగానే సంఘస్థితిని సవరింపగల్గుదురు. రష్యా దేశమున సంఘసంస్కరణముతో పాటు విద్యాసంస్కరణము గూడ జరిగినది. అటులనే ఇటలీ, జర్మనీ దేశములలో గూడ విద్యావిధానమున చాల మార్పులు జరిగినవి. దేశమునందున్న ప్రజలకందరికీ సమాన అవకాశ మొసంగుటే నవీన సాంఘిక ఆశయము. ఇందులకు ప్రజలందరు పనిచేయవలెను. మానవసంబంధములు మారవలయును. "ఇటువంటి ప్రపంచము నివాసయోగ్యముగా నుండునట్లు విద్యావిధానము విద్యార్థులకు బోధించుట ముఖ్యతమము". అని కొలంబియా విశ్వవిద్యాలయమునందలి డాక్టర్ రసెల్ గారు నుడివిరి. ప్రజలకందరికిని జ్ఞానమును కలుగజేయుటే గ్రంథాలయమున ముఖ్యకర్తవ్యము. ప్రజలలో నూతన జాతీయ జీవన, విజ్ఞానము నాగరకత మున్నగునని వృద్ధినొందవలెను. ఇప్పుడు మనకు అనుభవము గలదు. ప్రజలతో కలసి మెలసి తిరుగుటకు అవకాశములు గలవు. జ్ఞానమును బడయుటకును, సంఘసేవ చేయుటకును చాల అవకాశములు లభించునుగాన మనము సంఘపునర్నిర్మాణమును చేయగల్గుదు మను గట్టినమ్మకముతో పనిని ప్రారంభింపవలెను.

గ్రంథాలయములకు పుస్తకములు, పత్రికలు చేర్చినంతమాత్రమున వెంటనే మనము కోరిన ఫలితము కలుగదు. మనుష్యులకు సహజమగు విజ్ఞానసంపదను వారు తెలిసికొనగల్గుటకు తగు విధానమును మనము బాగుగా యోచించి నిర్ణయింపవలెను. అందులకు గ్రంథాలయములవారు చేయవలసిన పనుల వ్యాప్తి అధికము కావలెను. ప్రజలకు గ్రంథాలయములయొద్ద పుస్తకముల నిచ్చుటయేగాక వీలున్నంతవరకు ప్రజలలో సద్వర్తనము కలుగజేయుట ఇప్పుడు ముఖ్యావసరమై యున్నది. ఇందులకు గ్రంథాలయముల సంఖ్య చాల అధికము కావలెను. గ్రంథములు, ఉపన్యాసములు, మాజిక్ లాంతరులు మున్నగు వాటివలన ప్రజలలో జ్ఞానమును అత్యధికముగా వ్యాపింపజేయవలెను. ఆంధ్రదేశమునందున్న 12 జిల్లాలలోను ప్రాథమిక పాఠశాలలో గ్రంథాలయముల నేర్పరచి, ఆరీతిగా వాటిని ఉపయోగించుకొనవలెను. 12 జిల్లాలలో 10,000 ప్రాథమిక పాఠశాల లున్నవి గావున 10,000 గ్రంథాలయముల నేర్పాటు చేయవచ్చును. పాఠశాలల ఉపాధ్యాయులు గ్రంథాలయోద్యమములు సరిగా నిర్వహింప గల్గుటకు వారికి తగిన అభ్యాసమును కలుగజేయవలెను. ఈ గ్రంథాలయముల పరిపాలన బాధ్యతను జిల్లా బోర్డులకే వశపఱుపవలెను. ఇటుల గ్రంథాలయ వ్యాప్తికి ప్రాథమిక పాఠశాలలను పునాదులుగా చేసుకొని క్రమక్రమముగా దాని నభివృద్ధి నొందింపవలెను. సంఘసేవకు సంబంధించిన ఉద్యమములకు కావలసిన ధనమును సమకూర్చుటకు వ్యక్తులపై ఆధారపడగూడదు. ప్రభుత్వమువారుపన్నులనువసూలు చేయుచున్నారు. కావున విద్యావిషయమునను శారీరకవిషయముననువారు ఎక్కువ సేవ చేయవలసియున్నది. పాఠశాలలో చదువతగిన వయస్సుగల వారికిమాత్రమేగాక పెద్దవారికిని, మిక్కిలి చిన్నవయస్సు వారికినిగూడ జ్ఞానము

ను కలుగజేయుట విద్యాశాఖవారికర్తవ్యమైయున్నది. ప్రస్తుతము దొరతనమువారిటుల చేయుటలేదు. కావున ఆంధ్రదేశముయొక్క ఆవశ్యకమునుబట్టి గ్రంథాలయములను పోషించుటకు కావలసినంత ధనమును దొరతనము వారిచ్చునట్లు గ్రంథాలయోద్యమము వారును శాసనసభ్యులును, సంఘ సంస్కర్తలుగూడ దొరతనము వారిని నిర్బంధింపవలెను. ఇప్పుడు చెన్నరాష్ట్రము మొత్తముమీద కొన్ని వేలు మాత్రమే యిచ్చుచున్నారు కొన్ని లక్షలు కావలెను. వారటులు చేయువరకును ఎక్కువ పట్టుదలతో దేశసేవకు నిర్భయముగా తీవ్రమగు ఆందోళన జరుపుచునే యుండవలెను. శాసనసభ్యులు గ్రంథాలయ ఉద్దేశములను అవకాశములను తెలిసికొనినతర్వాతనే తగిన చిత్తుచట్టములను సిద్ధపఱుపవలెను. విదేశములలో చేయబడుచున్న చట్టములను అంధప్రాయముగా అనుసరించుటవలన మన కెట్టి లాభము కలుగదు. ప్రభుత్వమువారు ధన మొసంగనియెడల చట్టము చేయుటవలన ప్రయోజనము లేదు. కొన్ని సం॥లలో గ్రామమునకు కనీసమొక గ్రంథాలయమైన నేర్పడునటుల ప్రజానాయకులను ప్రభుత్వమును ప్రోత్సాహపఱచు నిమిత్తము ఉద్యమమున పనిచేయు నాయకులు దీక్షగా పనిచేసెదరా? ఇది అసాధ్యమని మన నాయకులు తోసి పుచ్చెదరేమో. వారటుల చేసినచో ప్రజల లాభమును తృణీకరించినవారే యగుదురు. పౌరధర్మములను సరిగా ప్రజలందరు నెరవేర్పవలెననినను దేశమునకు కావలసిన విషయములను బలపఱుపవలెననినను ప్రజలు విజ్ఞానవంతులుగా నుండవలెను. లేనిచో జాతీయ పునర్నిర్మాణము కొనసాగదు. కావున అందులకు కావలసినచట్టములు చేయబడుట, గ్రామములలోనున్న ప్రాథమికపాఠశాలలు గ్రంథాలయములుగా చేయబడుట, గ్రంథాలయముల నిమిత్తము కావలసిన ధనమును దొరతనమువారొసంగుట, మన దేశమునందలి స్త్రీలను పురుషులను గ్రంథాలయోద్యమమునందు తమబాధ్యతను గుర్తించి ఎక్కువశ్రద్ధతో పనిచేయుట మున్నగు విషయములనుగూర్చి మనమిపుడు దీక్షగా పనిచేయవలెను. దొరతనమువారు తమవిధులను నిర్వర్తించువరకు మనము మిన్నకుండవలెనని నాఉద్దేశము కాదు. ఈలోగా మనము చేయవలసినపని హెచ్చుగా నున్నది. ఇప్పుడు మండల సంఘములు, తాలూకా సంఘములు, చాల చోట్ల నున్నవి. కొన్నిచోట్ల పనిచేయుచున్నవి. మరికొన్ని చోట్ల పనిచేయుటలేదు. కొన్ని మండలములలో వందలకొలది గ్రంథాలయములున్నవి. మరికొన్నిటిలో చాల తక్కువగా నున్నవి. కొన్నిటికి ధనమెక్కువగానున్నది. మరికొన్ని నిరాధార స్థితియందున్నవి. అనుభవజ్ఞులును, నిపుణులగువారు కొన్నింటిని పరిపాలించుచున్నారు. కాని అధిక సంఖ్యాకములగు సంఘముల పరిపాలన సరిగా జరుగుట లేదు. కావున అభ్యాసమును బడసిన గ్రంథాలయాధికారులను నియమింపవలసియున్నది రాష్ట్రీయ సంఘమువారి సూచనల ప్రకారము రాష్ట్రములోని సంఘము లన్నియు సహకార సామరస్య భావములతో కలిసి పని చేసిననే గాని సరియైన ఫలితము కలుగదు. కావున ఒక సం॥ పాటు చేయవలసిన పనిని మన మిపుడు నిర్ణయించి దానిని దీక్షగా నిర్వహింపవలెను. అప్పుడప్పుడు గ్రంథాలయములను పరీక్షించుచుండవలెను. నాయకు

లతో ఉత్తరప్రత్యుత్తరములను జరుపవలెను. తఱుచుగా మండల తాలూకా గ్రంథాలయ సభలను జరుపుచుండవలెను. అటుల చేసినచో ఉద్యమము సరిగా నుండును. ఇందులకు నిపుణులు కావలెను. వారు తమ ప్రాంతములలో సమగ్రాభివృద్ధికొఱకు పనిచేయవలెను కావున గ్రామపునర్నిర్మాణముగూడ గ్రంథాలయోద్యమమున ఒక భాగముగ నుండవలెను. అమెరికావారీ పద్ధతిని అనుసరించుటవలన మంచిఫలితముకలిగినది. కావున మన దేశములో గూడ ప్రతిగ్రామమువారు తమ ప్రాంతములలో సరిగా పనిచేయు నెడల మన ఆశయమీడేరగలదు. ప్రజాప్రభుత్వాశయములను వృద్ధినొందించుటయును లాభకరములగు పనులను చేయించుటయును గ్రంథాలయ సంఘములవారి సేవకు ముఖ్యలక్షణములు. మానవ సంఘాభివృద్ధికి సంబంధించిన తక్కిన అన్ని ఉద్యమములతో కలసి గ్రంథాలయములవారు గూడ ఉదారభావముతో సాంఘికాభివృద్ధికి పనిచేయవలెను. ప్రజలలో విద్యయును, పాండిత్యమును, వినోదమును కలుగజేయవలెను. ఇందులకు ప్రజలు ప్రభుత్వముగూడ ఉద్యమమునకు తోడ్పడవలెను. ఇది జాతి కంతకును అధికమగు లాభమును కలుగజేయునట్టిది. కాని వ్యక్తిలాభమును కలుగజేయునది కాదు. జాతివిజ్ఞానము, ప్రజల సద్వర్తనము, సుఖజీవనము వీనిని బట్టియే జాతిఆధిక్యత యేర్పడును. ప్రాచీనులగు ఆంధ్రులు జ్ఞాన విజ్ఞాన సంపన్నులై యుండి మనకు విజ్ఞానమొసంగినను ఇప్పుడు ఆంధ్రులు దానిని సరిగా వినియోగించుకొన లేదను నపఖ్యాతికి మనము పాల్పడ కూడదు. అనంతరము ఈదిగువ తీర్మానములు చేయడినవి

## తీర్మానములు.

౧. ఆంధ్రగ్రంథాలయసభను ముందు సంవత్సరము చిత్తూరునకు ఆహ్వానించుచున్నారు.

ఉ: సి. వి. రంగంశెట్టిగారు

ఆ: యస్. యస్. రాజగోపాల్

౨. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమును ఆంధ్రదేశమునందలి గ్రంథాలయములకు ప్రాతినిధ్య సంస్థచేసి గ్రంథాలయోద్యమమును దేశమునందంతటను వ్యాపింపచేయు కార్యనిర్వాహకవర్గము నొకదాని నేర్పరుపవలెనని యీ సభవారు తీర్మానించుచున్నారు.

ఉ: యం. రామారావుగారు

ఆ: సరహరిశెట్టి ఆంజనేయులుగారు

౩. ఆంధ్రదేశముననున్న గ్రంథాలయములయొక్క పట్టికను త్వరలో ప్రకటించుట మిక్కిలి అవసరముగాన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారీ కార్యమును త్వరలో నెరవేర్పవలెనని యీసభవారు తీర్మానించుచున్నారు.

ఉ: వావిలాల గోపాలకృష్ణయ్యగారు

ఆ: పుణ్యమూర్తుల రాజశేఖరంగారు

౪. ఆంధ్రదేశమున జిల్లా తాలూకా గ్రంథాలయసంఘము నెలకొల్పుటకై యుప

సంఘము నొకదానిని ఏర్పరచుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

ఉ: యం. రామారావుగారు

ఆ: సరహరిశెట్టి రంగారావుగారు

౫. కీ॥ శే॥ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి జీవితచరిత్ర రచించిన గుమ్మడిదల సుబ్బారావుగారిని, శ్రీవారి గ్రంథము లన్నియు ప్రచురించిన ఆంధ్రవిద్యాపీఠగోష్ఠి వారిని ఈ సభవారు అభినందించుచు శ్రీవారి గ్రంథరాజములను ఆంధ్రదేశములో నున్న వివిధ గ్రంథాలయములవారు వారి గ్రంథాలయములందు ఉంచుట అవసరమని ఈసభవారు అభిప్రాయపడుచున్నారు.

ఉ: నుసర్ల బ్రహ్మదేవరశాస్త్రిగారు

ఆ: మల్లెల శ్రీరామమూర్తిగారు
బెజవాడ.

౬. ఇటుపై జరుగు సంవత్సరసభలలో జరిగిన సంవత్సరముల యొక్క కార్యక్రమమును ఆదాయవ్యయ పట్టికను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు తప్పక ప్రకటించుచుండవలెనని యీ సభవారు కోరుచున్నారు.

ఉ: పాతూరి నాగభూషణంగారు

ఆ: అయ్యంకి వెంకటరమణయ్యగారు

౭. పంచాయతీ బోర్డులచే నిర్వహింపబడు గ్రంథాలయములకు గాని లేక బోర్డుపేరున గాని పంచాయతీ ఫండునుండి పత్రికలు వగైరాలు ప్రభుత్వపు టనుమతి లేనిదే తెప్పించరాదని గావించిన సర్క్యులరువల్ల గ్రామప్రజలవయోజనవిజ్ఞానాభివృద్ధికి భంగకరము గావున సదరు సర్క్యులరును రద్దుపరచవలసినదిగా ప్రభుత్వము వారి నీ సభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు.

౮. మనరాజధానియందు నానాభాషల లో ప్రచురింపబడు గ్రంథములపట్టిక దొరతనమువారు ఫోర్టుసెంటు జార్జిగెజిటులో మూడు నెలలకొకసారి ప్రచురించుటవలన ప్రజాబాహుళ్యమునకు లేశమును లాభము కానరానందున జిల్లాగెజిటులో కూడ ప్రచురింపచేయునటుల ఈసభవారు దొరతనము వారికి తెలియపరచుచున్నారు.

ఉ: న. ఆంజనేయులుగారు

ఆ: అ. వెంకటరమణయ్యగారు

౯. చెన్నపురిలోనున్న కొనిమిరాలైబ్రరీ వారివలెనే మన ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులును ఆంధ్రరాష్ట్రగ్రంథాలయములనన్నిటిని తమకు జేరికగా చేసికొని ఆయాగ్రంథాలయములకు వలయు గ్రంథములను బదులుగా నిచ్చి పుచ్చుకొనుటలు జరుపుటకై తమసమ్మతిని తెలుపగలందులకు ఈసభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు.

౧౦. ఇదివరలో మద్రాసుప్రభుత్వమువారు పంచాయతీబోర్డులకొసంగుచుండెడిగ్రాంటును ప్రస్తుతము నిలుపుదలచేయుట గ్రామప్రజలవిజ్ఞానాభివృద్ధికి భంగకరము గావున వెంటనే మరలరాబోవు 1935-36సం॥ బడ్జెటు నుండియు పంచాయతీబోర్డులచే నిర్వహింపబడినగ్రంథాలయములకు గ్రాంటు నేర్పాటు చేయగలందులకు మద్రాసుప్రభుత్వమువారి నీసభవారు గోరుచున్నారు.

అధ్యక్షులు

౧౧. 1860 సం॥ నెం 21 రు చట్టప్రకారము రిజష్టరుచేయుట కివ్వవలసిన రుసుమును గ్రంథాలయములకును పఠనమందిరములకును లేకుండ ఉచితముగా రిజిష్టరీచేయించునటుల చట్టమును సవరించివేయవలెనని ప్రభుత్వమువారిని ఈసభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు

౧౨. ప్రభుత్వమువారు ప్రొవిన్షియలు ఫండునుండి వివిధగ్రంథాలయముల కొసంగు గ్రాంటుసందర్భములో గ్రంథాలయములు రిజష్టరు చేయబడవలయునను నిర్బంధమును తొలగించవలసినదిగా ప్రభుత్వమువారి నీసభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు.

౧౩. ముద్రాలయములలో ముద్రింపబడు గ్రంథములలో మూడేసిప్రతుల చొప్పున గైకొనుచు వానిని తమకు తోచినరీతిని పంపుచున్న దొరతనమువారిని నాల్గవప్రతికూడ గైకొనుచు నయ్యది ఆంధ్రుల కుపయోగపడునట్లు ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకో ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయమునకో పంపుచుండగలందులకు తగిన శాసనముల నిర్మించుటకై విద్యాశాఖకు సంబంధించిన శాసనసభ్యులను ఈ సభవారు కోరుచున్నారు.

అధ్యక్షులు.

౧౪. ఆంధ్రభాండారి తరిబీదు శిక్షణతరగతులను వెంటనే ప్రారంభించుట అవసరమని ఈ సభవారు ఆంధ్రవిశ్వ కళాపరిషత్తువారిని కోరుచున్నారు.

అధ్యక్షులు.

౧౫. ప్రభుత్వవిరాళములకై గ్రంథాలయములనుండి రాబడుదరఖాస్తులు అట్టి గ్రంథాలయము లుండు ప్రదేశమునకు గల మునిసిపాలిటీ లేక జిల్లాబోర్డుల ద్వారానే పంపబడవలయునను నియమమును తొలగించవలయునని ఈ సభవారు మద్రాసుప్రభుత్వమువారిని కోరుచున్నారు.

౧౬. గ్రంథాలయముల పోషణకొరకు Assessed wasto lands శిస్తుకట్టుగయారు భూములను గ్రంథాలయములకు శాంక్షన్ చేయుటకొరకు జిల్లా కలెక్టర్లకు ఉత్తర్వులిప్పించవలసినదిగా ఈసభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

ఉ: దశిక సుబ్బయ్యగారు

ఆ: ఏలూరుపాటి రామభద్ర చయనులుగారు

౧౭. ఎ. ఆంధ్రరాష్ట్రములోని ముఖ్యప్రాంతములగు జయపురం, పర్లాకిమిడి, బరంపురం మొదలగు ముఖ్యాంధ్రప్రదేశమును నూతన ఒరిస్సా రాష్ట్రములో చేర్చుచు ఆంధ్రాభ్యుదయమునకు ఆంధ్రవిజ్ఞానాభివృద్ధికి తీరని నష్టము కలిగించిన జాయింటు పార్లమెంటరీ కమిటీవారి సలహాను తీవ్రముగా ఖండించుచు అట్టిసలహాను ఉపసంహరించుకొను నటుల ఆంధ్రులెల్లరును ప్రచండాందోళన జరుపవలెనని ఈ సభవారు ఆంధ్రదేశీయులను కోరుచున్నారు.

బి. ప్రత్యేకాంధ్రరాష్ట్ర మవసరమని యీ సభవా రభిప్రాయపడుచు రాష్ట్రనిర్మాణమునకై తగువిధముల పాటుపడవలెనని దేశీయు లెల్లరను నీ సభవారు గోరుచున్నారు.

ఉ: వావిలాల గోపాలకృష్ణయ్య గారు

ఆ: మల్లెల శ్రీరామమూర్తి గారు

ఫలహారము.

సభానంతరము ఆనరబిల్ దివాను బహద్దరు గోపతి నారాయణస్వామిగారు ప్రతినిధులకు విందును గావించిరి.

రాత్రోపు సభ.

రాత్రోపుసభను చిత్తూరుజిల్లా నారాయణవరం హనుమద్గ్రంథాలయ కార్యదర్శియగు సి. వి. రంగం శ్రేష్ఠిగారు తమగ్రామమున జరుగుటకై ఆహ్వానించిరి.

అంతటితో సభ ముగిసినది.

## బాలగంగాధరతిలక్ పుస్తకాలయము, పెదపులివర్రు,

### రేపల్లె తాలూకా.

ఈ గ్రంథాలయముయొక్క త్రయోదశ వార్షికోత్సవము 14-11-34 తేదీనాడు శ్రీ చెరుకువాడ వేంకటనరసింహంగారి అధ్యక్షతక్రింద జరిగినది అప్పుడు నివేదింపబడిన ఈ సంగతులను ప్రచురించుచున్నాము.

ఇది పదమూడు సంవత్సరములక్రిత మీ గ్రామమందు స్థాపింపబడినది. రూ. 130 లు విలువగల గ్రంథములను, రూ. 20 లు చేయు బీరువాను బ్రహ్మశ్రీ పండిత కాశీనాథుని రాజలింగశాస్త్రిగా రిచ్చిరి.

గ్రంథాలయోద్యమముయొక్క ప్రాశస్త్యమును గమనించి లోకోపకార మొనర్ప స్థిత ప్రజ్ఞులై కొవ్వూరునందుగల ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు రూ. 12,000/-లు విరాళ మొసగి వారు రచించిన గ్రంథములను మన గ్రంథాలయమునకు సహితము పంపుచు అభిమానమును వెల్లడించు మహానుభావులు శ్రీ "వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారును" పూజనీయులు.

సం॥రములో 18 పాలకవర్గసమావేశములను, 1 సన్మానసంఘసమావేశమును జరిపి, 88 హంశములపై చర్చించి తీరుమానించినారు.

స్త్రీ విద్యావ్యాప్తికిగాను ప్రత్యేకనౌకరును నియమించి, నియమానుసారము పుస్తకములనిండ్లకందించి స్త్రీలయందు విజ్ఞానమును వృద్ధి చేయుచున్నారు.

1400 లకు పైగా గ్రంథములు 5 బీరువాలు కలిగి 10 పత్రికలు తెప్పించుచు పాఠకులు దినదినాభివృద్ధి యగుచున్నారు.

ఈ గ్రంథాలయమునకు 10 పత్రికలు వచ్చుచున్నవి. ఈ సంవత్సరము దాతలు 389 గ్రంథములను దయతో నొసంగిరి.

ఈ గ్రంథాలయమునకు 1931 సం॥ జూలైలో కాలువ లంకలపాటలకు గ్రామములోనున్న భిన్నభావములను బహు ఓర్పుతో నేకీభవింపజేసి ఆ పాటలమీద వచ్చిన ఆదాయమును ఖర్చులతో రు 966-0-0 వసూలు వరచి అప్పుడు ఉన్న జాతీయవిద్యాలయమునకు గ్రంథాలయమునకు జాయంటుగానున్న ఖాతాకు శ్రీ కనగాల కృష్ణయ్యచౌదరిగారు ఇప్పించిరి. 1934 సం॥రమునకు రు 100 లు మొత్తము రు 200 0-0 లు వడ్డీతోసహా. ది 3-10 34 భట్టిప్రోలువసూలు(దనరాభిక్షులు)

| శ్రీయుత | రు | అ |
|---|---|---|
| భట్టిప్రోలు చంద్రశేఖరరావుగారు | 0 | 8 |
| మద్దుల గిరిరావుగారు | 1 | 0 |
| పాలకుర్తి సీతారామయ్యగారు | 0 | 8 |
| మద్దుల నరసింహంగారు | 0 | 8 |

# ఆంధ్రదేశ గ్రంథాలయసంఘము, బెజవాడ

## వార్షికసభ

ఈ తేదీ (25-12-34) సాయంత్రం 6 గంటలకు 17-వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ సమాప్తిఅయినపిమ్మట ఈ సంఘముయొక్క వార్షిక సామాన్యసంఘసభ్యులసభ శ్రీ దాసు త్రివిక్రమరావుగారి అధ్యక్షతక్రింద సమావేశమై నూతన సంవత్సరమునకు (1935) ఈ క్రిందవివరించిన ప్రకారము ఎన్నికలు జరిపిరి.

అధ్యక్షులు—దాసు త్రివిక్రమరావుగారు,

ఉపాధ్యక్షులు—

రావుసాహేబ్ యం. అప్పారావుగారు, భూపతిరాజు సీతారామరాజుగారు, దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు, భూపతిరాజు తిరుపతిరాజుగారు, శ్రీరాజా యార్లగడ్డ శివరామప్రసాద బహద్దరు జమీందారుగారు, ఊటుకూరి వెంకటసుబ్బరాయ శ్రేష్ఠిగారు, బొడ్డపాటి సీతాబాయమ్మగారు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, బెజవాడ రామచంద్రారెడ్డిగారు, వి. ఆర్. పార్థసారథి అయ్యంగారు, వామన్ నాయక్ గారు, వి. రంగనాథం మొదలియారుగారు, పామి వెంకటాచలం శ్రేష్ఠిగారు, అట్లూరి వెంకటసీతమ్మగారు, కాశీనాథుని నాగేశ్వరరావుగారు, గోపు రామచంద్రరావుగారు, మంతెన పుల్లంరాజుగారు.

కార్యదర్శి—అయ్యంకి వేంకటరమణయ్యగారు,

సహాయకార్యదర్శులు—

మల్లెల శ్రీరామమూర్తిగారు, ముద్దుకృష్ణగారు, ఉత్తి బలరామయ్యగారు, మారేపల్లి రామచంద్రశాస్త్రి కవిగారు, పుణ్యమూర్తుల రాజశేఖరంగారు, నేత్రకంటి యోగానందరావుగారు, ముసర్ల బ్రహ్మదేవరశాస్త్రిగారు, వేముగంటి పాపాయమ్మగారు, బులుసు వెంకటసుబ్బారావుగారు, కొండ సచ్చిదానందరాజుగారు, రైప సుబ్రహ్మణ్యశర్మగారు, మాదపాటి హనుమంతరావుగారు, కప్పూరి రామాచార్యులుగారు, వి. వి. రంగం శ్రేష్ఠిగారు, చట్టి నరసింహారావుగారు, పావిలాల గోపాలకృష్ణయ్యగారు.

కార్యనిర్వాహకవర్గము—గంజాంజిల్లా.

పుల్లెల శ్యామసుందరరావుగారు
జగన్నాథపాణి ఖడంగగారు
పాట్నూరి స్వామిబాబుగారు
విశాఖపట్నం—పురిపండా అప్పలస్వామిగారు
తెన్నేటి విశ్వనాథంగారు
బుర్రా శేషగిరిరావుగారు
తూర్పుగోదావరి—నరసింహదేవర సత్యనారాయణగారు
కందుకూరి రామభద్రరావుగారు
నాళం కృష్ణరావుగారు
పశ్చిమగోదావరి—నరహరిశెట్టి ఆంజనేయులుగారు
వేగేసిన సూరపరాజుగారు—పాందువ్వ
కలిదిండి గంగరాజుగారు
పోతాప్రగడ శ్రీరామారావుగారు
కృష్ణా—కామినేని వెంకటప్పయ్యగారు
రేపాల బుచ్చిరామశేషయ్యగారు
పురాణం సూరిశాస్త్రిగారు
గుత్తా వీరయ్యగారు
గుంటూరు—పాతూరి నాగభూషణంగారు
కస్తూరి కుటుంబరావుగారు
నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారు
కర్నూలు—రాజా పెద్దసుబ్బారాయుడుగారు
దేశపాండ్య సుబ్బారావుగారు
శేర్వూరి యల్లమందయ్యశ్రేష్ఠిగారు
అనంతపురం—హట్టి శంకరరావుగారు
కాదూరి వెంకటసుబ్బయ్యగారు—హిందూపురం
కల్లూరి సుబ్బారావుగారు
కడప—టి. రామకృష్ణయ్యగారు
యస్. కృష్ణస్వామిగారు
బళ్ళారి—టి. రాఘవాచారిగారు
చిత్తూరు—టేకూరి సుబ్రహ్మణ్యంగారు
బూదూరు రామానుజులురెడ్డిగారు
యం. శ్రీనివాసాచార్లుగారు
నెల్లూరు—గండవరపు హనుమారెడ్డిగారు
బొమ్మా శేషురెడ్డిగారు
తూములూరు శివరామయ్యగారు
మదరాసు—కస్తూరి లక్ష్మీనరసింహారావుగారు
ఆర్. జనార్దనరావునాయుడుగారు
రాజపోషకులు—మంతెన పుల్లంరాజుగారు-పాందువ్వ

# ధర్మవరముతాలూకా ద్వితీయగ్రంథాలయ సమావేశము.

**15-12-34 తేదీ శనివారమునాడు నాగసముద్రమునందు ధర్మవరము బోర్డు హైస్కూల్ ప్రధానోపాధ్యాయులగు శ్రీయుత పర్వతరాజు సూర్య నారాయణరావు, B. A., L. T గారి యాజమాన్యమున జరిగిన పై సమావేశమునందు కావింపబడిన**

**తీర్మానములు.**

(1) గ్రామపంచాయతీ గ్రంథాలయాభివృద్ధికై ఇదివరలో నొసంగుచుండిన మేరకే విరివిగా విరాళముల నొసంగుటకై తగిన యేర్పాట్లు గావించునట్లు ప్రభుత్వమువారిని ప్రార్థించునదిగా తీర్మానించుటయైనది.

(2) గ్రంథాలయములనురిజిస్టరిచేయించుటకై 1860 సంవత్సరపు XXI ఇండియా ఆక్టులో విధింపబడియుండు రూ 50/ రుసుమును తగ్గించుటకై తగిన సవరణల నుపపాదించునదిగా భారతశాసనసభకు మనరాయలసీమ ప్రతినిధిగా నెన్నుకొనబడియుండు శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారిని కోరునదిగా తీర్మానించుటయైనది.

(3) ప్రతిగ్రామ పంచాయతీబోర్డువారును తమస్వాధీనమున నుండు గ్రంథాలయమునకు తమ గ్రామపాఠశాలలో పాటుపడుచుండు ఉపాధ్యాయమహాశయుని గ్రంథాలయభాండాగారికునిగా ఉపయోగించుకొనుట చాలా శ్రేయస్కరమని ఈసభవారు సూచించుచున్నారు.

(4) ధర్మవరముతాలూకా గ్రంథాలయ సంఘమువారు గ్రామసీమలందు విజ్ఞానవ్యాపనమునకై పూనుకొన్న సంచారగ్రంథాలయోద్యమమును జయప్రదముగా కొనసాగించుటకు ధర్మవరముతాలూకాబోర్డువారు మంజూరుచేసియుండిన రు 100/ విరాళముతుత్వరలో శాంక్షన్‌చేసి యిప్పించునట్లు అనంతపురము జిల్లాబోర్డువారిని ప్రార్థించునదిగా తీర్మానించడమైనది.

(5) ధర్మమునందు శ్రీ క్రియాశక్తి ఒడయర్ గ్రంథాలయమునకు సుందరమందిరము నిర్మించి శాశ్వతకీర్తి నార్జించి, మన మండలమున నితరులకు మార్గదర్శకులైన శ్రీయుత బండ్లపల్లి లక్ష్మీనారాయణ శ్రేష్ఠి గారికి ఈసభవారు తమహృదయపూర్వక అభివందనముల నర్పించునట్లు తీర్మానించడమైనది.

(6) ధర్మవరముతాలూకా గ్రంథాలయ సంఘమునకు ఈక్రింద కనపఱచిన వారలను అధికారులనుగా నెన్నుకొనునట్లు తీర్మానించడమైనది.

(7) గ్రంథాలయోద్యమమున పాటుపడుచుండిన శ్రీయుత బెల్గాం రామదాసునాయుని గారి అకాలమరణమునకై ఈసభవారు తమహృదయపూర్వకసానుభూతిని వెల్లడించునట్లు తీర్మానించడమైనది.

అధ్యక్షుడు—

హట్టి శంకరరావుగారు,

ఉపాధ్యక్షుడు—

బండ్లపల్లి లక్ష్మీనారాయణశ్రేష్ఠిగారు,

కార్యదర్శి—

రామానందుల వెంకటేశమయ్యగారు

సహాయకార్యదర్శులు—

తాలూకాలోని ప్రాథమిక పాఠశాలోపాధ్యాయ కేంద్రసంఘ కార్యదర్శులు.

ఇతర కార్యనిర్వాహకవర్గము.

1 కోటంపల్లి గోవింద రెడ్డిగారు
2 యాదాళం వెంకప్ప శెట్టిగారు
3 పన్నా రంగప్పగారు
4 న్యామద్దుల పంచాంగం ఆదెప్పగారు
5 పేరూరు రామకృష్ణరావుగారు
6 ఈడిగ వెంకటప్పగారు (కనగానపల్లె)
7 గోనుగుంట్ల లింగారెడ్డిగారు (మాల్యవంతము)
8 చిందలూరు రామచంద్రయ్యగారు
9 యర్రగుంట హనుమంతరావుగారు

---

# సంచార గ్రంథాలయములు — వయోజనవిద్యాసేవ.

కుమారగురుకులము — మన్నారుగుడి

( ఏప్రిల్ - సెప్టెంబరు 1934 - ఈ అర్థ సంవత్సరములో నిర్వహింపబడిన కార్యక్రమము. )

సంచారగ్రంథాలయము:- సంచారగ్రంథాలయసేవ 1931 వ సంవత్సరము అక్టోబరులో ప్రారంభింపబడి 1934 సెప్టెంబరు తుదివరకు గ్రామములలో మూడు సంవత్సరములు కార్యక్రమమును నిర్వహించెను.

ఈమూడు సంవత్సరములలో సాంఘికాభ్యుదయమునకు వహించిన శ్రద్ధతో బాటు వ్యక్తిగతముగ కూడ పఠనాదికములందు ప్రత్యేకశ్రద్ధ దీసికొనబడినది. ఇట్టి శ్రద్ధ మనుష్యులను వారి యావశ్యకతలను గుర్తెరుంగ జేసినది. 112 గ్రామములలో నున్న 1523 మంది ప్రజలు పుస్తకములను పఠించిరనియు, గడచిన యారు నెలలలో మొత్తము 9157 పుస్తకములు పఠింపబడినవని గుర్తించుట సంతృప్తికరమైన విషయము.

సుమారు 500 చదరపుమైళ్లు గల యేడు తాలూకాలలో అనేక గ్రామములలో సంచారగ్రంథాలయసేవ జరిగెను.

గ్రామసంఘములు:- (అనగా 16 గురు సభ్యులకు తక్కువగాని సంఘములు) 1931 వ సంవత్సరములో 12 గ్రామసంఘములును, 1932 లో 100 ను 1933 లో 118 యును, నున్నవి. ఈ సంఖ్యయందు పరిశోధన చేయు 15 సంఘములు చేరలేదు పరిశోధన చేయు సంస్థలు నాలుగు తప్ప తక్కినవి విలయము చేయబడినవి. ఇపుడు 137 సంఘములను కలిగి యున్నాము. మొత్తము 141 సంఘములలోను 112 సంఘములు చక్కగా పని జేసినవి.

ప్రతి సందర్శనమునకును పాఠకులలో ప్రతివారును ఒక్క పుస్తకమునైనను నుపయోగించినచో నా సంఘము బాగుగ పనిచేయుచున్నదని లెక్క వేయవచ్చును. ఈవిధముగ పనిచేయుచున్నవి 112 సంఘము లున్నవి. అనగా మొత్తము 141 లో నూటికి 80 వంతు ఈ విషయములన్నియు పరికించినచో మా సేవ జనాదరణీయమై యున్నదని యొప్పుకొందురు.

## కౌమార గురుకులము, మన్నారుగుడి.

1934 సం. సెప్టెంబరు ఆఖరువరకు గ్రామకేంద్రములను సూచించుపటము.




ఈపటములో చిన్న ఎర్రని త్రికోణములు : గ్రామకేంద్రములు.

,, ,, వలయములు : సభలు జరిగిన స్థలములు.

,, ,, చతురములు : వేసవి పాఠశాలలు జరిగిన స్థలములు.

మూడు పెద్ద వలయములు.— మొదటిది (పెద్దది) మన్నారుగుడినుండి 12 మైళ్ళ వ్యాసార్ధము; రెండవది 8 మైళ్ళ వ్యాసార్ధము; మూడవది (చిన్నది) 4 మైళ్ళ వ్యాసార్ధము గలది.

గ్రామసభ్యులు వారి శక్త్యనుసారము సాయపడిరి.

గ్రామసంఘములలో సభ్యులు :- పైనవివరించిన 112 శాఖగా పనిచేయు సంస్థలలో 108 రిజిస్టరు చేయబడినవి. పరిశోధన జేయుచున్నవి 4 గలవు. ఈ 108 శాఖలలో 2232 మంది సభ్యులు గలరు. కాని 1463 మందియే పుస్తకము లుపయోగించుకొనిరి. అనగా మొత్తముమీద నూటికి 61.65%

గ్రామములకు సందర్శనములు:— ఈ 112 సంఘములకు ఈ 6 నెలలలో 327 మార్లు సందర్శనములు జరిగినవి. అనగా సుమారు ఒక్కొక్కదానికి 3 సందర్శనములు జరిగినవి. అవి యీ క్రింది విధముగ విభాగించబడినవి.

| సంఘములు | | సందర్శనములు |
|---|---|---|
| 11 | పొందినవి | 1 |
| 23 | ,, | 2 |
| 44 | ,, | 3 |
| 32 | ,, | 4 |
| 2 | ,, | 5 |

ఈ సందర్శనములు పుస్తకములు ఇచ్చుట తీసికొనుటమాత్రమే జరిగినవి. అనేక సమయములందు పుస్తకములు ఇచ్చుటకు, తీసికొనుటకు అనేక కారణములవలన వీలు లేకపోయినది. అందులో నొక ముఖ్యకారణమటుల చేయుటకు కాలవ్యవధి లేకపోవుట. గ్రామస్థుడు సాధారణముగ ప్రాతఃకాలమందో లేక రాత్రికాలమందోగాని యింటివద్ద నుండడు. ఎక్కడకు వెడలునో ముందు నిర్ణయింపజాలము. మేము పని జేసిన యీ యారుమాసములును వివాహదినములును, వ్యవసాయదినములునై యున్నవి.

గ్రామసంఘములకు సందర్శనములు:—

| | (A) | (B) | (C) |
|---|---|---|---|
| 1931—32 | — | 92 | 92 |
| 1932—33 | 147 | 259 | 406 |
| 1933—34 | 100 | 285 | 385 |
| 1934—35 | 316 | — | — |

(A) ఏప్రియల్ - సెప్టెంబరు - మొదటి అర్ధ సంవత్సరము.

(B) అక్టోబరు - మార్చి - తరువాతి యర్ధ సంవత్సరము.

(C) సంవత్సరమునకు మొత్తము.

నిలవలో పుస్తకములు : (1) ప్రస్తుతము మావద్ద 3718 తమిళపుస్తకములు, 819, ఆంగ్ల గ్రంథములు 537 రిఫరెన్సు పుస్తకములు నున్నవి. కొన్ని హిందీ, తెలుగు పుస్తకములుకూడ నున్నవి. ఈ యారు నెలలలో నభివృద్ధి 397. వీటిలో చాలవరకు బహూకృతము. 80 రూపాయల విలువగల పుస్తకములు కొంటిమి. 1933-34 వ సంవత్సరమునకు గవర్నమెంటువారు ఇచ్చిన 70 రూపాయలు పూర్తిగ వినియోగింపబడినవి.

ఆంగ్లగ్రంథములు చాలినన్ని యుపయోగింపబడలేదు. బహుశః అవి యున్నవని యెవరికిని తెలియదేమో. గ్రామములలో చాలమంది ఆంగ్లభాష తెలిసినవారు కలరు.

గ్రామసంఘములకు పుస్తకములిచ్చుట.

| సంవత్సరము | ఇచ్చినపుస్తకములు |
|---|---|
| 1931-32 | 1429 |
| 1932-33 | 5985 |
| 1933-34 | 5365 |
| 1934-35 | — |

1931-32 మొదటి అర్ధసంవత్సరములో గ్రామములో వేసవికాలపు పాఠశాలాసంఘా

రము వలనను, హెడ్ క్వార్టర్సునుండి పుస్తకములను తీసికొనుటవలనను సంఖ్యలో కొంత తగ్గుదల గానవగుచున్నది. క్రమముగ పుస్తకములను ఇచ్చుటలో అభివృద్ధిగానవగును.

గ్రామసంఘములలో పఠనము :- మాకష్టములలో నిజముగా నిది యొక ముఖ్యాంశమైయున్నది. కడచినవత్సరములలో చేసిన ప్రయత్నములు పాఠకులపేర్లు వ్రాయలేదుగాన విజయవంతము కాలేదు. కడచిన 6 మాసములనుండియు పాఠశాల రిజిష్టరువలెనొకరిజిష్టరు ప్రతిసంఘమునం దుంచబడెను. ఆరిజిష్టరులలో సంచారకులు ప్రతిసభ్యుడు ఎన్ని పుస్తకములు చదివినదియు వాకబు చేసి, పత్రముల (Slips) సహాయమువలన వ్రాయబడెను. ఈ 6 నెలలలో 112 గ్రామములలోనున్న 1523 ప్రజలు మొత్తము 9157 గ్రంథములు పఠించిరి. వారి సావకాశ సమయము సద్వినియోగము చేయబడెను.

(3) కనీసము చదివిన గ్రామములు:— కాణరమే మైననుసరియే. మొత్తము 50 పుస్తకములకంటె తక్కువ చదివిన గ్రామములు సంతృప్తికర మైనటుల నంగీకరించుటకు వీలులేదు. ఈసంగతి వారికి తెలియజేయబడును. వారు అభివృద్ధి కనబరతురని యాశించుచున్నాము. ఈ రిమార్కుక్రిందికి వచ్చు గ్రామములు 57 అందులో 18 ఆదిద్రావిడ సంఘములు. అవి తక్కువ సభ్యత్వమును కలిగియున్నవి. వానికి తక్కువ పుస్తకము లీయబడును. కావున వారికి పఠించుటకు తక్కువ యవకాశమే కలదు. గనుక ఆదిద్రావిడులకు ప్రత్యేకశ్రద్ధ తీసుకొనబడవలెను. ఇందులో చాల భాగములకు సందర్శనములు (visits) చాలినన్ని లేవు. ఈ విషయమున కేవలము గ్రామసంస్థలను నిందించుటకు వీలులేదు.

(4) గ్రామములో పఠనౌన్నత్యము వివిధ సంఘముల బాగును విమర్శించుటలో గమనించవలసిన ముఖ్యవిషయము లేవనగా- (1) పాఠకులసంఖ్య (2) సందర్శనములసంఖ్య (3) ఇచ్చినపుస్తకములసంఖ్య. ఈ ఔన్నత్య ప్రమాణములకు తగిన శ్రద్ధ వినియోగించుచు ఒక్కొక్క సందర్శనమునను ఒక్కొక్కరు ఒక్కొక పుస్తకము చదువునటుల చేయబడెను.

వ్యక్తులపఠనముధిక:— సందర్శనమునకు 19.5. ఇది అత్యంతసంఖ్య (maximum) కడచిన యారు నెలలలో 4 సందర్శనములలో ఒక్కొక్కరు చదివిన పుస్తకములసంఖ్య 50.

మా పుస్తకములు పెద్దయక్షరములు కలవి, సులభశైలి కలవి, నిరాడంబరమైనవి, 200 పేజీలకు మించనివి యుపయోగింపబడినవనిమాత్రము మరువకూడదు.

వేసవిపాఠశాలలు.

1932 లో పాఠశాల : 1932 లో వేసవి పాఠశాల 15 దినములు జరిగినది. అందున 40 మంది ప్రముఖులచే జీవితాంశము లన్నిటిమీద నుపన్యాసము లియ్యబడెను. 45 గురు పెద్దలు దానికి విచ్చేసిరి. నాలుగు సంచికలలో నుపన్యాసములు ముద్రింపించబడెను. కాని, అట్టి కొద్దికాలములో నేమియు పఠన ముద్దేశించుటకు వీలులేదు.

1933 లో పాఠశాల:—1933 లో వేసవి పాఠశాలలు గ్రామగులలో, 4, 5 దినములు

నిర్వహింపబడినవి. సుమారు 20 ఉపన్యాసములు జీవితాంశములమీద 6 గురు ఉపన్యాసకులచే నియ్యబడినవి. అట్టివి 8 పాఠశాలలు నిర్వహింపబడినవి మొత్తము 217 మంది హాజరైరి. వివిధసంగతులు నేర్చుకొనుటకు అభిలాషయును, ఉత్సాహమును కలుగుటకు మార్గము చూపుటకంటె వేరేమియు చేయలేకపోతిమి. ఈవిధముగ ప్రతి సంవత్సరమున మనము చేయగలిగినచో వయోజన పాఠశాల నేర్పరచుటకును 4 లేక 8 నెలలు నిర్వహించుటకును మార్గము చేకూరగలదు. నా యనారోగ్యమువలనను, దృష్టిమాంద్యమువలనను ఈ పని యీ సంవత్సరము జరుగలేదు. ఈ సంస్థల నేర్పరచుటకును, సంచారమునకును ఖర్చులు కావలసియున్నవి. కావున నిపుడు మే మట్టివి భరింపజాలము.

**1934 లో పాఠశాల.**— ఈసంవత్సరమున వేసవికాలములో హెడ్ క్వార్టర్సునందు ఒక వసతిపాఠశాల నిర్వహింపబడినది. వసతికిని భోజనమునకును ఒక్కొక్కనికి రు 6 లు నిర్ణయింపబడినవి. పాఠశాల 7 వారములు జరిగినది. హరిజనుల సంఘములలో చాల మంది మాంసాహారు లగుటవలనను, అట్టిసదుపాయము చేయలేకపోవుటవలనను 6 గురు హాజరైరి. అందులో ఒకరు మధ్యలో వెడలిపోయిరి. మిగతవారు కొద్దిదినములలో శాకాహారమున కలవడి అదియే మెచ్చుకొనిరి. చదువు ఉచితముగ చెప్పబడెను.

వారికి తమిళగద్యమునందలియంశములు పద్యవాఙ్మయము, వ్యాకరణము, పద్యములు అప్పచెప్పుట, సులభ తమిళశైలియందు ఉత్తరములు వ్రాయుట, చదువుట, నేర్పబడినవి. ప్రాథమిక గణితము, సాంఘిక శాస్త్రము, పారిశుద్ధ్యము, వ్యవసాయము, భారత దేశచరిత్ర, భూగోళము, శాస్త్రపాఠములు, చిత్రలేఖనముకూడ బోధించబడినవి. పుస్తకములవలన నేర్పబడినదానికంటె నధికతరమైనది రోమన్, దైనందినము వారు ప్రార్థన, దేహపరిశ్రమ, స్నానం, ప్రాతర్భోజనము, పఠనము మొదలగువానితో కాలముగడిపిరి.

మద్యపానము:— ఈ ప్రదేశము నందెక్కువమంది నిమ్నజాతులకును, అస్పృశ్యులకును చెందినవారుగాన వారియుద్ధరణకు మొదలిడు నేకార్యక్రమమైనను ముందర పానసమస్యతో మొదలిడవలెను. అపుడు విద్య యభివృద్ధిచెందగలదు. చాల ప్రదేశములలో గ్రామఫోనువల్లను మ్యాజికులాంతరువలననుకూడ ప్రజలు త్రాగియుండుటచే నాకర్షింపబడలేదు. కాన వయోజన నిరక్షరకుక్షిత్వము, మూఢత్వము పోగొట్టుకొనుటకు మితపానము ముఖ్యావశ్యకమైన పని తెలిసికొంటిమి. ఈ ఏప్రియల్ మొదలుకొని దానికి మ్యాపులవలనను, బొమ్మలవలనను ప్రత్యేకప్రచారము జరుగుచున్నది. 20 గ్రామములలో జులైయందును, అగష్టులో 29 యందును, సెప్టెంబరులో 34 యందునను, ఇంక ననేకగ్రామములలోను ప్రచారము జరిగినది.

మ్యాజికులాంతరు ఉపన్యాసములు.

అధ్యక్షుని యనారోగ్యమువలన మ్యాజికులాంతరు ఉపన్యాసము లిపుడు ఆపివేయబడినవి. దైవానుగ్రహమువలన నవి త్వరలోనే మరల ప్రారంభింపబడునని తలంచుచున్నాము.

---

# కన్నప్పర్ గ్రంథాలయఅభినందనపత్రము

మదరాసు, 27-12-34

భారతశాసనసభ యెన్నికలయందు అఖండ విజయమునందిన శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని సన్మానించుటకుగాను రాయపురమునందలి "కన్నప్పర్" ఉచితపఠనాలయమువారు నిన్న సాయంత్రము బహిరంగసభ నేర్పరచి, సన్మానపత్రము నర్పించి సత్కరించిరి.

గ్రంథాలయసంఘమువారు నాగేశ్వరరావు పంతులుగారికి హృదయపూర్వకమగు స్వాగతమొసగుచు, ఇటీవల జరిగిన భారతశాసనసభ యెన్నికలయందు వారికట్టి బ్రహ్మాండమగు విజయము లభించినందుల కానందమును వెల్లడించిరి. గ్రంథాలయ భవననిర్మాణ నిధికి పంతులుగారిదివరకే, భూరి విరాళము నొసగియుండిరి.

ఈ గ్రంథ పఠనాలయము 1929 సం॥న ప్రారంభింపబడెను. అల్పారంభమయ్యును, గత మూడువత్సరములలోను, జమీందారులయొక్కయు, పంతులుగారివంటి ఉదార స్వభావులయొక్కయు సహాయమువలన, ఇప్పటి యౌన్నత్యమునకు రాగల్గెను. హరిజన బాలబాలికలకును, వయోజనులకును ఈ గ్రంథాలయమువారు విద్యాదానమొసర్చుచున్నారు. ప్రజలు తగినంత విరివిగ విరాళముల నొసగక యుపేక్షించుటచే, గ్రంథాలయమంత సత్వరాభివృద్ధి గాంచజాలకపోయెను. గ్రంథాలయభవననిర్మాణ మింకను పూర్తిగా లేదు సహజౌదార్యసంపన్నులగు శ్రీ పంతులుగారి దాతృత్వఫలితముగ, అచిరకాలములోనే భవననిర్మాణము పూర్తియగునని నమ్ముచున్నాము.

# విజ్ఞానము – గ్రంథాలయములు *

( శ్రీ పులిజాల వెంకటరంగారావుగారు )

## విద్య.

మన లక్ష్యము విద్య. మన యుద్యమ స్వభావము విద్య. అదియే మన గమ్యస్థానము. ఒకరి సుఖదుఃఖములలో నొకరు పాల్గొని విద్యావిజ్ఞానముల నార్జించుటకు సహాయపడుటయే మనకు గావలసినది. అదియే మనమూలసూత్రము. అదియే మనము తరించుటకుగల సాధనములను సమకూర్పగలదు.

గ్రంథములను జదివినపండితులుగాని, విశ్వవిద్యాలయమువారిచే పట్టములను బడసినవారుగాని, విద్యావంతులు గాజాలరు. అతిసూక్ష్మములగు ఆధ్యాత్మిక లక్షణములను, ఆపదలలో శాంతమును, సజ్జనస్థలములో నానందమును, లోకవ్యవహారములయందు నిష్కపట్యమును, సంపూర్ణమగు సుచితానుచిత విచక్షణము, న్యాయానుసార

* నిజామురాష్ట్ర తృతీయాంధ్రమహాసభాధ్యక్షులుగ నొసంగిన యుపన్యాసమునుండి.

బుద్ధియు, నైతికస్థైర్యమును, కార్యదీక్షయు ఎవరి కుండునో వారే విద్యావంతులు. వివిధజాతి సమ్మేళనమగు హిందూదేశనిర్మాణమునకు సహాయపడుటయే విద్యాభ్యాసప్రయోజనమైయుండవలయును. దానిప్రయోజనము మన జీవితరహస్యమెఱుంగుటయే. విద్యార్థిజీవనమునందు ప్రకృతి, మానవకోటి, దేశము మొదలగుభావములు తరంగితములగుచుండవలయును.

ప్రతిమానవుడును విద్యార్థి. ప్రపంచమే యాతనికి విద్యాలయము. విద్యార్థులకు తామేమిచేయవలయునో నేర్పునది విద్య. స్త్రీలకు గృహనిర్వహణకౌశలమును గలిగించునది విద్య. వృత్తిపరులకు తామెట్లు ప్రవర్తింపవలయునో చెప్పునది విద్య. ప్రజలకు తమ ధర్మమును బోధించునది విద్య. వారికి తమ హక్కులను ప్రసాదించునది విద్య. రాజులకు రాజ్యాంగమును స్థాపించునది విద్య. ఉద్యోగులను తమకర్తవ్యమునకు పురికొల్పునది విద్య. మతకక్షలను మాన్పునది విద్య. సాంఘికదురాచారములను బోద్రోలునది విద్య. వేయేల? బాలురకును బాలికలకును, యువకులకును యువతీమణులకును, పాలించు రాజునకును రాజోద్యోగులకును పాలింపబడు రైతులకును, తమతమ విధ్యుక్తధర్మమును బోధించి ఉద్ధరించునది, వ్యక్తిత్వమును పెంపొందించునది, మన ప్రవృత్తి నుద్రేకింపజేయునది, స్వయంసహాయమును, ఏకాగ్రతను సమకూర్చునది విద్య. ఇట్టివిద్యను సాధించుటయే మనపరమావధి.

గ్రంథాలయములు, పఠనమందిరములు.

మన హైదరాబాదునందు మాత్రము సర్కారుప్రాపున నొక గ్రంథాలయము విజ్ఞానవీచికలను వెదజల్లుచున్నది. కాని బహుజనసంఖ్యగల హైదరాబాదునగరమునకీ ఆ గ్రంథాలయము చాలదనిన తప్పుగాదు. ప్రజాపక్షమున అచటచట కొన్నిగ్రంథాలయములు, పఠనమందిరములు స్థాపింపబడినవి. కాని అవి పోషింపబడనందున నూటికి ౯౦ చో॥ శిథిలమై మ్రగ్గుచున్నవి. సాగుచున్నగ్రంథాలయములయందైనను చదువువారి సంఖ్య మిక్కిలితక్కువ. సామాన్యగ్రంథాలయములే శూన్యమైనపుడు సాంకేతికగ్రంథాలయములుగాని, ప్రత్యేకకళలను బోధించు గ్రంథములుగలిగిన ఆలయములుగాని, సంచారగ్రంథాలయములుగాని ఎట్లుండగలవు? అదేమి దురదృష్టమోగాని యింతవరకు గ్రంథాలయములపై మనప్రభుత్వమువారు తమ కరుణాదృష్టిని బ్రసరింపజేయలేదు. మన సర్కారువారు ఈవిషయమై బరోడాసంస్థానము వారిపద్ధతి ననుసరించిన చాల ఉపయోగకరముగా నుండును.

నిర్బంధప్రారంభవిద్యయు, యువతీయువకవిద్యయు, గ్రంథాలయములను ఆయా ప్రాంతములయందుగల దేశభాషలలో ఎంతవరకు స్థాపించబడవో గ్రామజీవనముగల మనప్రజలలో వారిజీవితవిధానము ననుసరించి వారి కవసరమున్న విద్యాప్రణాళికయును, పట్టణజీవితముగలవారికి వారిస్థితిగతుల కనుకూలించు విధానమును స్త్రీపురుషులకు ప్రత్యేకముగా ఎంతవరకవలంబింపబడవో అంతవరకు నిశ్చయమైన అభివృద్ధి అసంభవము. ఇట్టి మార్గములు తత్క్షణమే అవలంబించినను దేశమున విద్య ప్రబలుటకు దాదాపు ౫౦ సంవత్సరములు కావలయును. ఈమధ్య నేను శ్రీరాజ రాజ నరేంద్రాంధ్రభాషా

నిలయరజతోత్సవమునకు హనుమకొండ వెళ్లియున్నపుడు, ప్రజానురంజకులును, విద్యాప్రియులు నగు నక్కడి సుబేదారు ఆలి జనాబు మౌల్వీ అబ్దుల్ బాసిత్ ఖానుగారు ఒక గ్రంథాలయమును స్థాపించనున్నారని వినియుంటిని. వారు ఇట్టి ఆదర్శపూర్వకమైన గ్రంథాలయమును స్థాపించి యితరులకు మార్గదర్శకులయ్యెదరని నమ్ముచున్నాను.

పైన సూచింపబడిన విషయములు ప్రభుత్వపక్షమునగాని, ప్రజాపక్షమునగాని ఎంతవరకవలంబింపబడవో అంతవరకు మనము విద్యావిషయమున వెనుకకు నడచుచున్నామని చెప్పవచ్చును. మనకొఱకై విజ్ఞానము నార్జించి, మనప్రభుత్వము కొన్ని గ్రంథములలో దాచి మనకు పంచకజ్జాయమువలె బంచిపెట్టునని యనుకొనుట మన వివేకతాశూన్యమున కొక నిదర్శనము. మనము మన కాళ్లపైననే నిలబడవలసియున్నది.

---

# గ్రంథాలయాభివృద్ధి.*

( శ్రీ అయితరాజు జీడికంటి రామారావుగారు )

విద్యకు వికాసమును గల్పించునవి గ్రంథాలయములు. గ్రంథాలయములు భాషాప్రయుక్తములు. దేశాభివృద్ధికి భాషాభివృద్ధియే ముఖ్యసాధనము. భాషాసమన్వితములగు వివిధవిజ్ఞాన ప్రబోధగ్రంథరాశితో భాసిల్లునవి గ్రంథాలయములు. ఇలాటి గ్రంథముల బఠించుటవలన మానవున కనేకవిషయములందు తెలివితేటలు గలిగి, అనుభవవిజ్ఞానసంపత్తి చేకూరనున్నది గావున నీగ్రంథాలయములు గ్రామగ్రామమున నెలకొల్పబడు టధికావశ్యకము. దీనివ్యాపనకై యిదివరకు కేంద్రసంఘమువారు చాల కృషిసల్పి జిల్లాలలో నూటముప్పదిదాక గ్రంథాలయముల నెలకొల్పించిరిగాని యవికూడ నిప్పుడు మందగించియున్నవి కొన్ని గ్రంథాలయము లంతరించినవి. కావున వీనిపునరుద్ధారణకును నూతనగ్రంథాలయస్థాపనకును, గ్రంథాలయోపయోగమును బోధించుటకును విశేషప్రచారము మరల సాగించుటకును ప్రయత్నించవలసియున్నది. ఈగ్రంథాలయోద్యమమునకు సరియైన ధనసహాయము లభించక పోవుటవలన నీయుద్యమముతగ్గిపోవుచున్నది.

పాఠశాలలకువలె గ్రంథాలయవ్యాప్తికిని, వానిపోషణకును కొంతమొత్తము ప్రభుత్వమువారు వినియోగించినచో విద్యాభివృద్ధికై సమగ్రప్రయత్నమొనర్చినదానిలో జేరును.

గ్రంథాలయస్థాపనావ్యయమును భరింపజాలని పల్లెలలో విజ్ఞానవ్యాప్తికై సంచారగ్రంథాలయముల నేర్పరచి తద్ద్వారా విద్యాప్రచారము సులభముగా జేయవచ్చును.

* నిజాంరాష్ట్ర తృతీయాంధ్ర మహాజనసభ ఆహ్వానసంఘాధ్యక్షులుగ ఇచ్చిన యుపన్యాసమునుండి.

# గ్రంథాలయములు - వానియావశ్యకత. *

( వప్పూరు రామాచార్యులుగారు )

ఈ నెల 19 వ తేదీ సాయంకాలము రాణీ సత్రములో తిమ్మనచెర్ల జనార్దన గ్రంథాలయ వార్షికోత్సవము శ్రీమాన్ వప్పూరు రామాచార్యులవారి అధ్యక్షతలో జరిగెను. మ. రా. శ్రీ కె. వెంకోబరావుగారును ఆర్. విశ్వంగారును ఈ గ్రంథాలయవార్షికోత్సవ విషయమున నెక్కువశ్రద్ధపూని పనిజేసిరి. శ్రీయుతులు కల్లూరు సుబ్బరావుగారును, బందరు నుండివచ్చిన చెలుకువాడ వేంకటనరసింహంగారును సభనలంకరించిరి. కార్యదర్శిని వేదిక అధ్యక్షునికిసన్మానపత్రము సమర్పింపబడిన వెనుక, కల్లూరు సుబ్బరావుగారు మాటాడుచు నేటికాలమున రామకృష్ణాలయములకంటె మిన్నగా మనము సరస్వతీఆలయములను పోషింపవలసినదనియు గ్రంథాలయములే అట్టి సరస్వతీ యాలయములనియు నుడివిరి. చెలుకువాడ వేంకటనరసింహముగారు తమ సహజ గంభీరధోరణి నుపన్యసింపుచు మనము మనపుత్రులయొక్కయు పుత్రికలయొక్కయు బాహ్యశరీరపోషణమునకై వేనవేలు వెచ్చింపుచుంటిమనియు దానికాధారమగు మనస్సు బుద్ధి ఆత్మ వీనియభివృద్ధికి ధనము వెచ్చించుటకు వెనుదీయుచుంటిమనియు, బాలురకు ధర్మము నీతి, పుణ్యము నేర్పుట తలిదండ్రుల ధర్మమనియు, తండ్రిహరి జేరుమనియెను తండ్రి తండ్రి అని ప్రహ్లాదచరిత్రలోని నుడి తథ్యమనియు నుడివిరి. జనులు మూఢులై రామకోటి మొదలగు వ్యర్థకార్యములలో నిమగ్నులగుచుండిరనియు, సత్యధర్మశౌచములను మనలో వృద్ధి పొందించు కార్యములను చేయుటలో మనకు ముక్తి యున్నదిగాని ఆడంబరముకొరకు చేయు కార్యములవలన ముక్తి కలుగదనియు గ్రంథాలయము వృద్ధినొంది గ్రామములలో మంచి స్థానము నాక్రమించుకొన్న వెనుక గ్రామాభివృద్ధి కార్యములను తర్వాత జేయసులభసాధ్యమనియు నుడివిరి.

## అధ్యక్షోపన్యాసము.

గ్రంథాలయముల పోషించుట గ్రంథాలయవార్షికోత్సవములు జరుపుట ఈ కాలమున విశేషముగా వినుచున్నాము. కాని మనదేశములో నవి ఇంకను చాలవు. ఇతర రాజ్యములతో పోల్చి చూచినయెడల మన గ్రంథాలయోద్యమ మింకను శైశవదశలోనే యున్నది. ధనము గలవారు దీనిని పట్టుకొని సాహాయ్యము చేయకుండుటే ఇందుకు కారణము. వారు దానములు చేయుచునే యున్నారు గాని పాత్రాపాత్రావివేచనములేక చేయుచున్నారు. ధర్మములు కాలదేశపాత్రములను బట్టి మారుచుండును. నీళ్ళుదొరకని గుంతకల్లువంటి ప్రదేశములలో బావులు త్రవ్వించుట పుణ్యకార్యము కావచ్చును. కాని గంగానదీతీరమందో బావిని త్రవ్వించుటవలన పుణ్యమురాదు అక్కడ నది యనవసరము. కాశీయాత్ర పోవువారికి మార్గమధ్యమున అన్నసత్రము లుంచుట పుణ్యముగా భావించ

* అనంతపురంజిల్లా "తిమ్మనచెర్ల" యందున్న శ్రీ జనార్దన ఉచితగ్రంథాలయ వార్షికోత్సవసమయమున ఇయ్యబడినది.

బడుచుండెను. ఇప్పుడు కాలినడకను ప్రయాణముచేయుట అరుదు. పైగా ఎక్కడను హోటలులు ఎక్కువగా నున్నవి. కావున అన్నసత్రములవలన నిప్పు డెక్కువ యుపయోగము కనుబడదు. బీదల కన్నదానము చేయుమాట కాదు. అది ఎప్పటికిని అవసరమే. పూర్వపద్ధతిని అన్నసత్రము లుంచుట ఇప్పు డనవసరము. ఈ విధముగా దానముగూడ దేశకాలములను గుఱించి మారును. ఇప్పుడు అత్యవసరముగా దానము చేయవలసినది జ్ఞానము. జ్ఞానదానమువంటి దానము వేరొకటి యుండదు. గ్రంథాలయములు కట్టించుట, పత్రికలను తెప్పించియిచ్చుట గ్రంథములు కొనియిచ్చుట, గ్రంథములను వ్రాయించి గ్రంథకర్తలను పోషించుట ఇత్యాదు లిప్పుడు జరుగవలసిన పనులు.

పూర్వ మెట్లుండెనో యేమోగాని ఇప్పుడు ప్రపంచము ముఖ్యముగా మన దేశము దుఃఖమయముగా నున్నది. జీవికలు గడచుట కష్టము; దేశము దారిద్ర్యమున మునిగియున్నది. ఏవృత్తిలోను పోటీ. ఎవ్వరికిని సుఖము లేదు. కాని మానవుడు సుఖముకొరకు వెంపరలాడుచుండును. దుఃఖమును మఱచి తాత్కాలికసుఖము ననుభవించుటకు ప్రయత్నించును. త్రాగుట, జూదము, సిగరెట్లుకాల్చుట, సినిమాలు ఇవి అన్నియు తాత్కాలికసుఖము నిచ్చుననుటకు సందేహము లేదు మనుజునకు కష్టము లెక్కువైనకొలది హృదయములో శాంతి తక్కువై ఇట్టి తాత్కాలికసుఖములకొరకు ప్రయత్నించును.

కాని ఇవి ఆనందము నిచ్చునవి కావు. తాత్కాలిక సుఖములు త్రాగిన రెండుఘడియలు వానికి బాగుగ నుండవచ్చును గాని తర్వాత వాడా దుఃఖమును ఇబ్బడిగా ననుభవించవలసినదే. అట్టే తక్కిన సుఖములు. అవి మనుజునకు శాంతము నియ్యజాలవు. సుఖము తాత్కాలికము, ఆనందము శాశ్వతమైనది. అట్టి ఆనందమువంక దృష్టిపడినచో మనుష్యుడు తుచ్ఛసుఖముల కాశింపడు. ఆనందము మనస్సునకు శాంతినిచ్చును. అది సద్గ్రంథపఠనమునగాని వేరువిధముగా లభింపదు. సజ్జనుల గోష్ఠివలన గూడ నది కొంతవరకు లభింపగలదు. ఈరెండును గ్రంథాలయమున మనకు లభింపగలవు.

కవులు తమ భావములను కావ్యరూపమున నుంచినారు. కవి గ్రంథము నొక్కటిగైకొన్నచో వాని జీవితములోని సారాంశమంతయు గ్రహించినట్లే. గ్రంథాలయములో శతాబ్దములు వెనుకనున్న మహాకవులను మనము కలిసికొని వారితో సంభాషింపవచ్చును. వారు నిష్పక్షపాతముతో నిస్వార్థదృష్టితో మనకు నీతి నుపదేశింపగలరు.

పూర్వమువలె గ్రంథపఠన మిప్పుడంత కష్టము కాదు. తాటియాకుల గ్రంథములు గాక నేడు చక్కని ముద్రితప్రతులు సులభముగా లభించుచున్నవి. మనము వానిని వినియోగించుకొని లాభముల బడయవలెను.

పేదలందరు గ్రంథాలయములకు చందాలిమ్మన నియ్యరు. ఉచిత గ్రంథాలయము తెరచుట ఐశ్వర్యవంతులకు విధి. పేదవారి కష్టమువలననే సాహుకా రైశ్వర్యవంతుడైనాడు. కావున వారికి సుఖమును వినోదములను, జ్ఞానమును, కల్గించుట ధనికులకు విధి. పూర్వమున ధనవంతులే పురాణములు, హరి

కథలు తోలుబొమ్మలాటలు, బయలునాటకములు మొదలగువానిని ఆడించుచుండిరి. పేదలందరు టిక్కెట్టు లేకనే చూచివిని ఆనందము జ్ఞానమును సంపాదించుచుండిరి. ఇప్పుడు నాటకములకు సినిమాలకు టిక్కెట్లున్నవి. పేదలు పోవుటకు వీలులేదు, కావున వారికి జ్ఞానసాధనములు కొఱవడినవి. దేశము మరింత అజ్ఞానములో బడిపోవుచున్నది. జనులనీతి క్రమముగా తగ్గి భక్తి విశ్వాసములు అదృశ్యములైనవి.

కావున ధనవంతులమీద బాధ్యత హెచ్చుగా గలదు. వారు తమసొమ్మును స్వార్థమునకు వినియోగించి తామే జ్ఞానవంతులు విద్యావంతులగుటకు ప్రయత్నించినచో లాభము లేదు. వేయిమంది అశుచిపరులలో ఒక్కడు ఆచారవంతుడుండిన వాని ఆచారము నిలువదు. కావున సాధ్యమైనంతమందికి విద్యాదానము చేయుట అందరికిని విధియై యున్నది. వీనికి ముఖ్యసాధనములు గ్రంథాలయములే. రష్యాలో బీదలందరికిని ఉచితసినిమా నాటకశాల లేర్పఱుపబడినవి. వానిమూలమున వారు జ్ఞానమును సంపాదించుచున్నారు.

తెనుగున నెన్నియో గ్రంథములు లేవు. మీరు చుట్టకు సిగరెట్టునకు వ్యయము చేయు ధనములో 6 వ పాలు వ్యయము చేసినచో దివ్యమైన గ్రంథాలయ మేర్పడగలదు. జనుల నాకర్షించునిమిత్తము గ్రంథాలయములలో పురాణములు, హరికథలు చెప్పించవలెను. రేడియో ఒకటి నుంచిన ప్రపంచపువార్తలన్నియు తెలియుచుండును. పత్రికలు చదివి వినిపించుట కేర్పాటుచేయవలెను. వ్యాయామశాల లేర్పాటుచేసి యువకుల నాకర్షించి వారికి జ్ఞానాభివృద్ధితో పాటు దేహారోగ్యాభివృద్ధికూడ కల్గింపవలెను.

మనదేశములో పలువురు చదువనేర్చినారుగాని రచనాశక్తి చాలమందికి తక్కువ. పండితులుగూడ నాలుగు పంక్తులు నిర్దుష్టముగా వ్రాయజాలరు. వ్రాయగలవారు సోమరులై రచనాశక్తిని వృద్ధిచేసికొనరు. కావున పోటీపరీక్షలు వ్యాసరచనాపరీక్షలు పెట్టి గ్రంథాలయములు చదువరులలో రచనాశక్తి వృద్ధిచేయవలెను.

ఇట్టి కార్యము లన్నియు చేసి, గ్రామములందు గ్రంథాలయములు జ్ఞానజ్యోతివలె ప్రకాశించి జనులకు అనేకవిధముల ఉపయోగించవలెను. మీ గ్రామమునందు జనులెల్లరు సాయపడి ఈ జనార్దన గ్రంథాలయమును సర్వవిధముల వృద్ధి పొందింతురుగాక.

---

---

# ఉపాధ్యాయులకు గ్రంథాలయ నిర్వహణ తరగతులు




మదాసు గ్రంథాలయ సంఘమువారిచే 16—12—34 నుండి జరుపబడెను.



ప్రబ్రహ్మాత్మికాం దేవీం భుక్తిముక్తి ఫలప్రదాం,
ప్రణమ్య నౌమి తామేవ జ్ఞానశక్తిం సరస్వతీమ్.

౯-వ సంపుటము.

# గ్రంథాలయసర్వస్వము.

౫-వ సంచిక.

ఫిబ్రవరి 1935

## మిత్రుడు

మిత్రులందరు మిత్రులే మిత్రుడనగ
శ్రీజగన్మిత్రుడొకనికే చెల్లుగాక
ధాత్రి నితరుని మిత్రుగా దలచుటెల్ల
గాడిదను గోవు నొకగాడి గనుటగాదె.
సుకవిరచనలలో దక్క చూతమన్న
మిత్రుడనువాడు లేడు సూ ధాత్రియందు
ఈకలిని మిత్రలక్షణ మొగిరిపోయె
మిత్రశబ్దంబుమాత్రము మిగిలిపోయె
దవ్వు దాపనునట్టిభేదములు లేవు
కాలదిగొప్పల యంతరువులును లేవు
మరియు లేవు పరోక్షసమక్షములును
క్రొత్తప్రాతలు లేవు మిత్రులకు నిజము
ఆపదలయందు తప్పక యడ్డుపడును
కూరుమను మేలు మారుమేల్ కోర కెపుడు
అరమరలు లేక ప్రాణము లైన నిచ్చు
అట్టిఘను డొక్కడే మిత్రుడగును సుమ్మ
ప్రియము పలుకడు మొంమెచ్చుక్రియల జొరడు
హితము బోధించు బహునిష్ఠురతల కోర్చు
ఆకు పిందెనువలె సదా సాకు పొదిగి
మిత్రసరిసాటి యొక్కండు ధాత్రినున్నె?

—మంగిపూడి వేంకటశర్మ.



# ప్రయోజన విద్య

( యాతగిరి లక్ష్మీవెంకటరమణ, గ్రంథాలయ సేవకుడు. )

ప్రాచీనకాలమున భరతవర్షము సుభిక్షమై వెలయుచుండెను. గ్రామజీవనము సుఖప్రదమై యుండెను. ప్రజలు ఆరోగ్యవంతులై పెద్దలయెడ గౌరవము, దైవభక్తి కలిగి, సంతుష్టులై, స్నేహభావముతో అన్యోన్యసహకారమువలన జీవయాత్ర గడపుచుండిరి. ప్రజాజీవనమునకు గ్రామమే పునాదిగా నుండెను. ఏ గ్రామమునకు కావలసిన అవసరావశ్యకతలను ఆగ్రామవాసులే సమకూర్చుకొనువారు. గ్రామసంఘములు ఉమ్మడి ధనమును సేకరించి, దేవాలయములను, సత్రములను, చావిళ్ళను, తటాకములను బావులను శుభ్రపరచుచు గ్రామారోగ్యమును కాపాడుచు వైద్యసహాయము నొసగూర్చుచు పంచాయతులమూలమున సమస్తమైనజగడములను పరిష్కరించి స్నేహభావమును పెంపొందించి భూలోకస్వర్గముగా తలంపజేయుచుండెడివారనిన నతిశయోక్తి యేమాత్రమును లేదు.

ఆధునికకాలమున గ్రామము కడుహీనస్థితియందున్నది. గ్రామవీథులన్నియు మురికికాల్వలచేతను పెంటకుప్పలచేతను కప్పబడి దుర్గంధభూయిష్ఠమై యున్నవి. ప్రజలనారోగ్యవంతులైయున్నారు. తగు వైద్యసహాయము లేదు. వృత్తులు నశించినవి. ఎల్లయెడల నిరుత్సాహము తాండవమాడుచున్నది. పెద్దలయెడ గౌరవభావము లేదు. ప్రజలన్యోన్యకలహాకారులై తమ ధనప్రాణముల గోల్పోవుచున్నారు. తమ కాలమునంతను దురభ్యాసములందును వృథాకాలక్షేపములందును దుర్వినియోగము చేయుచున్నారు. జీవనోపాధి లేక నివాసయోగ్యముగా నుండక గ్రామప్రజలు క్రమక్రమముగా పట్టణములకు జేరుచున్నారు. ఇట్టిదుస్థితికి జ్ఞానహీనతయే ముఖ్యకారణము.

అజ్ఞానమును పోగొట్టునది విద్య. విద్యయనగా కేవలము చదువను వ్రాయను లెక్కలు వేయను నేర్చుకొనుటమాత్రము కాదు. విద్యకీమూడు విషయములును సాధనములు. ప్రయిమరీ పాఠశాలలోని విద్య ప్రజలమనస్సును దున్నుటవంటిది. దున్నినమనస్సుపై మంచివిత్తనములను చల్లి పైరు పండింపవలసియున్నది. ప్రజలబుద్ధిని వికసింపజేసి విజ్ఞానమును వెదజల్లవలెను. మనుజుని కాయికమానసిక ఆధ్యాత్మికశక్తులయొక్క సామరస్యమే విజ్ఞానము. విద్య మనుజునికి ఐహికాముష్మికసుఖముల నొసగూర్చునదై యుండవలెను. అట్టివిద్య కోమలవయస్సునందున్న బాలురకే కాదు; ఈడుముదిరినవారికిగూడ సమకూర్పవలసియున్నది. మనదేశప్రజలు నూటికి 95 పాళ్లు వ్యవసాయమే వృత్తిగా గలిగి గ్రామములలో నివసించుచున్నారు మనదేశసౌభాగ్యమంతయు వారిచేతులలో నున్నది. అట్టిజనసామాన్యమునందు జ్ఞానము వెదజల్లి ఉద్ధరించనిచో మనదేశ మధోగతిపాలు కావలసినదే.

ప్రభుత్వమువారు రాజకీయపరిపాలనమును క్రమముగా ప్రజల హస్తగతము చేయుచున్నారు. ఆయుర్వేదమునకు ప్రోత్సాహము నిచ్చుచున్నారు. గృహపరిశ్రమలకు దోహదమొసగుచున్నారు. ఆరోగ్యవ్యవసాయప్రదర్శనములను చూపుచున్నారు మాదిరిపొలములను సేద్యముచేయుచున్నారు. సాధ్యమైనంతవఱకు ప్రైమరీ సెకండరీపాఠశాలలను నెలకొల్పుచున్నారు. గ్రంథాలయములకు ధనసహాయము చేయుచున్నారు. దీని నవకాశముగా గొని మనదేశమున గల విద్యావంతులును దేశసౌభాగ్యము నొసగూర్చుట కనువగు పెద్దలవిద్యయెడల శ్రద్ధ వహించితగుమార్గములనన్వేషింపవలసియున్నది

ఈవిషయమున పూర్వము మన దేశమున నెట్లు జరుగుచుండినదియు ప్రథమమున విచారింతము. గ్రామప్రజలు పగలంతయును శ్రమపడి రాత్రి భోజనానంతరము విశ్రాంతి జెందుటకు చెరువుగట్టునకో, మర్రిచెట్టునీడకో, రచ్చరాతికడకో చేరుచుండిరి. గ్రామపెద్దలు అటకు విచ్చేసి తమ అనుభవములను, జ్ఞానమును, కథలరూపమునను ఉపన్యాసరూపమునను వెల్లడిచేయుచుండెడివారు. లోకకల్యాణము వాంఛించి సంచారముచేయు సాధువులు అట్టి గ్రామసమావేశములకు విచ్చేసి తమ ఆధ్యాత్మిక జ్ఞానమును గ్రామప్రజలకు బోధించి వారిని ధన్యులగా జేసెడివారు. గ్రామములందు నివసించుచు, సంస్కృతాంధ్రములందు పాండిత్యములను సంపాదించిన పెద్దలు అనుదినమును ఒక నియమితకాలమందు గ్రామప్రజల నాకర్షించి పురాణములను చదివి అర్థముచెప్పుచు తమ అనుభవమును, జ్ఞానమును, పురాణములందు గర్భితములైయున్న పరమార్థములను తెలియజెప్పుచుండెడివారు. గ్రామప్రజ లందరును సమావేశమగుటకు దేవాలయ మొక ముఖ్యసంస్థగా నుండెడిది. గ్రామప్రజలు దేవాలయమును పూజాస్థానముగను, సభాభవనముగను, పాఠశాలగను, ధర్మశాలగను ఉపయోగించుకొనుచుండిరి. జాతీయప్రదర్శనములగు బొమ్మలాట, భాగవతములు, మన పురాణపురుషులచరిత్రను ప్రజాసామాన్యమునకు చక్కగ బోధించెడివి. హరికథలు భజనలు జనులలో భక్తిని పెంపొందించి భక్తిపారవశ్యులను జేయుచుండెడివి. పల్నాటి వీరచరిత్రము, బొబ్బిలి యుద్ధములను పాడి పాటగాండ్రు సంగీతమం దభిరుచిని ధైర్యసాహసములను కలిగించుచుండెడివారు.

నవనాగరకతకు నిలయములగు పాశ్చాత్య దేశములందు పెద్దలవిద్యావ్యాపకమునకు ఏయే మార్గముల ననుసరించుచున్నారో కనుగొనుట లాభకరము. ఇంగ్లండుదేశమున పెద్దల విద్యను గూర్చి పాటుబడు సంస్థలు చాల గలవు. అచటి విశ్వవిద్యాలయములుగూడ ఆపనిని నెరవేర్చుచున్నవి. గ్రామములలో నుండు యువకులు కొందఱొక సంఘముగా జేరి తమకేవిషయమున జ్ఞాన మవసరమో ఆసంగతిని తమ ప్రాంతమున నున్న విశ్వవిద్యాలయమువారికి తెలియబరచెదరు.

విశ్వవిద్యాలయమువారు వెంటనే అచట నొక తాత్కాలిక పాఠశాలను నెలకొల్పెదరు. ఇంటి అద్దె, చిల్లర ఖర్చులను మాత్రము సంఘమువారు భరింపవలెను. ఉపన్యాసకుల జీతమును, ప్రయాణ ఖర్చులును, భత్యమును విశ్వవిద్యాలయమువారే భరింతురు. ఉపన్యసింపవలసిన విషయమునంతను ఉపన్యాసములక్రింద విభజించి ముందు వాని నచ్చొత్తించి ఆసంఘమునకు పంపెదరు. ఆవిషయమును వివరముగా తెల్పు గ్రంథనామములను అందుదాహరించెదరు. పిమ్మట వారమున కొకతూరియో రెండుమార్లో తరిబీయతుకాబడిన ఉపన్యాసకులను పంపుదురు. ఉపన్యాసకుడు రెండుగంటలకాల ముపన్యసించుచుండును. ఉపన్యాసానంతరము విద్యార్థులు ఉపాధ్యాయుని ప్రశ్నించి తమ సందేహములను తీర్చుకొందురు. విద్యార్థులు విషయములను గ్రహించినది లేనిది తెలిసికొనుటకు ఉపాధ్యాయుడు వారిని ప్రశ్నించును. ఉపన్యాసము లన్నియు పూర్తియైన పిమ్మట పరీక్షచేసి విద్యార్థులకు సర్టిఫికెట్లును, బహుమతులను నిచ్చెదరు.

బ్రిటిషు పారిశ్రామిక విద్యాసంఘమువారు కూడ స్వయంసహాయముపై జీవించుకూలి వారలకు పెక్కుమార్గముల విద్యాదానము చేయుచున్నారు. ప్రత్యేక ఉపన్యాసముల నిప్పించుచున్నారు. విద్యాగోష్ఠుల నేర్పరచుచున్నారు వేసవిపాఠశాలలను తెరచుచున్నారు. గురువిద్యాలయములను స్థాపించుచున్నారు. ఈ సంఘమువారు 1926 సంవత్సరమున ప్రారంభ దినోత్సవమును జరిపిరి. వీరియుద్యమము ముఖ్యముగా పారిశ్రామిక సంఘముల కొఱకేర్పడినది. అందు వారు ప్రథమమున ఆర్థికవిషయములకు ప్రాముఖ్యము నిచ్చి పారిశ్రామికోద్యమమునకు నాయకులను వక్తలను తయారుచేయుటయే తమ యాశయముగా నుంచుకొనిరి. వారు తమ యాశయమున జయము గాంచిరనియే చెప్పవలసియున్నది.

1916 సంవత్సరమునుండియు ఆదేశమున మండల గ్రంథాలయసంఘములవారు కూడ పెద్దల చదువు వృద్ధిపరచుటకు పాటుపడుచున్నారు. వారు గ్రామపాఠశాలలను శాఖా గ్రంథాలయములుగా చేయుచున్నారు. అట్టి స్థలములకు ప్రజలు అయిదారుమైళ్లు దూరముగ నున్నవారుకూడ పోయి గ్రంథములను గొంపోవుచున్నారు. కొన్ని మండలములవారు గ్రంథములను మోటారుబండ్లలో నుంచుకొని చదువరులున్నచోటికి గొంపోయి అందజేయుచున్నారు. ఆబండ్లలో పాటకులసంఘమును గాని నటకుల సంఘమును గాని కొనిపోయి ప్రదర్శనముల మూలమున ప్రజల జ్ఞానవంతుల నొనరించుచున్నారు. ఆసమయమందు వారు మంచి నాటక పుస్తకములను, పాటల పొత్తములను ప్రజల కిచ్చుచుందురు.

అమెరికాదేశమునందును వయోజనవిద్యావ్యాపకమునకు అనేకసంస్థలున్నవి. అచట విశ్వవిద్యాలయమువారు సమీపగ్రామములలో గాక విద్యాలయసమీపముననే తాత్కాలిక పాఠశాలల నేర్పాటుచేయుదురు. ప్రభుత్వమువారు ఈ సంస్థలకు ప్రత్యేకగ్రాంటులనిచ్చుచున్నారు. ఈ పాఠశాలలలో గరపు విద్య డిగ్రీవిద్యలకు సామీప్యములో నుండును. సంయుక్తపారిశ్రామిక విద్యాసంఘమువారు ట్రేడు యూనియను సభ్యులకు విద్యనొసగుచున్నారు. అమెరికాలో న్యూయార్కుషైరులో ఒక సగస్సుసమీపమున 1874 సం॥న స్థిరమైన వేసవిపాఠశాల స్థాపింపబడెను. దానిలో నూర్గురు స్థిరమైన అధ్యాపకులున్నారు. అచట తరిబీయతుపొందుటకు ఆరు వారములు పట్టును. పిమ్మట వందలకొలది వేసవిపాఠశాలలు దేశమందంతటను వెలసినవి.

ఫ్రాన్సుదేశమున ఉపన్యాసముల మూలమున జనసామాన్యమునకు విద్య గరపుటకు ఆ ప్రభుత్వమువారు ధనసహాయ మొసగుచున్నారు. స్వచ్ఛందసేవకులు (యూనివర్సిటీ పాప్యులర్సు) అను సంఘములను నెలకొల్పి ప్రజలకు ఉత్తమతరగతివిద్య నొసగుచున్నారు.

కొన్ని యేండ్లక్రితము డెన్మార్కుదేశమున ప్రజలు నిరక్షరకుక్షులై దరిద్రావస్థలో నుండిరి. మనదేశమువలె వారికిని వ్యవసాయమే జీవనాధారముగా నుండెను. అప్పుడు వారు మేల్కాంచి జనసామాన్యమునందు విద్యను వ్యాపింపజేసి, పాలు, పెరుగు తయారుచేయుట యను జాతీయ పరిశ్రమను చేపట్టి మంచిస్థితికి వచ్చియుండిరి. ఆదేశమున తప్పక ప్రతిగ్రామమునను ఒకసర్వజనమందిర ముండును. ఆమందిరము, ఒకప్రక్కను గ్రంథాలయము, పఠనమందిరముతోను, రెండవప్రక్కను ఉపన్యాసవేదికతోను శోభించు

చుండును. గ్రామప్రజలు తమ దినచర్య ముగిసినపిమ్మట ఆమందిరమున సమావేశమగు చుందురు. ఆ మందిరములందు అప్పుడప్పుడు విశ్వవిద్యాలయపండితులును, విద్యార్థులును గ్రామస్థులకు అవసరమగునట్టియు, ఉపయుక్తమైనట్టియు విషయములను ఉపన్యసించుచుందురు.

పాశ్చాత్య దేశములన్నిటిలోను ప్రజలందరు చదువను వ్రాయను నేర్చియుండుటచేత సంచారగ్రంథాలయముల మూలమున వయోజనవిద్యావ్యాపకమున కెక్కువ వీలుగానున్నది. వయోజనవిద్య యేసూత్రములపై నాధారపడియుండవలెనో తెలియజేయుచు ఒక అమెరికను ప్రముఖుడిట్లు చెప్పెను. వయోజనవిద్య యితరవిద్యాపద్ధతులతో మూడువిషయములందు భేదించును. (1) ఒకరి ఉత్కృష్టానుభవమును మరియొకరికి తెలియబరచుకొనుట కవకాశము కలుగచేయుటయే దీని ముఖ్యోద్దేశము. (2) నిజమైన విద్య స్వానుభవముతోగాని శాస్త్రాధికారములతో కూడియుండరాదు గావున చర్చాపద్ధతులతో ప్రారంభింపబడవలయును. (3) అట్టి చర్చలయందు గురువుగాని నాయకుడుగాని మార్గదర్శకుడుగా నుండవలెను గాని శాసనాధికర్తయై యుండకూడదు. పద్ధతి చిన్న సంఘములకే వర్తించును గాని జనసమూహమునకు విద్యగరపుటకుగాని ఉపన్యసించుటకుగాని వీలునివ్వదు. ఈ పద్ధతియందు గ్రంథములకు స్థానములేనట్లు తోచునుగాని అవి కొంతవఱకు నూతనపక్కని ఉపయోగములోనికి వచ్చుచుండును.

ఇంతవఱకు మనదేశములో నుండిన పూర్వపద్ధతులును పాశ్చాత్యదేశములలో ప్రకృతము అనుసరించుచున్న వివిధమార్గములును అభిప్రాయములును గమనించియున్నాము. ఇటుపైని మనదేశమున పల్లెలందు పట్టణములందును పాఠశాలకు పోయి చదువుకొనుటకు ఈడుమీరిన వారు ఎన్నితరగతులవారున్నారో వారందరికి ఎట్టివిద్య ఆవశ్యకమో కనుగొందము. గ్రామములలో (1) సంస్కృతాంధ్రములందు పూర్వపక్కని పండితులై పూర్వార్జిత భూములపై నాధారపడువారును (2) ఆంగ్లేయవిద్యను కొంతవఱకభ్యసించి భగ్నమనోరథులై తిరిగి పల్లెలకు జేరి పూర్వార్జితపుఆస్తితో జీవయాత్ర గడుపువారును (3) ప్రైమరీవిద్య నభ్యసించి వ్యవసాయమో చేతిపనులో వృత్తిగాగలవారును, విద్యాగంధ మేమియు లేక వ్యవసాయమో, కూలిపనియో వృత్తిగా గలవారును కలరు. పట్టణములలో (1) పాశ్చాత్యవిద్యలలో ప్రావీణ్యము బొంది పరిపాలనాచక్రమునందు తిరుగువారును (2) వర్తకము మొదలైన స్వతంత్రవృత్తి నవలంబించి పుష్కలముగా ధనము సంపాదించి స్వేచ్ఛగా జీవించువారును (3) కొంతవఱకు ఆంధ్రఆంగ్లభాషల నేర్చి కలముపోటువలన జీవించువారును, (4) కూలి నాలి చేసి జీవించు పాటకపుజనమును ఉన్నారు.

పై అన్నితరగతుల ప్రజలకును ఆవశ్యకమును, ఉపయుక్తమును అగు విద్యను నాల్గు తరగతులుగా విభజింపనగును. మొదటిది వృత్తికి సాధనభూతమైనది.

మనదేశమున బహుజనులకు వ్యవసాయమే ప్రధాన వృత్తిగా నున్నది. వ్యవసాయకులు ప్రాతపద్ధతిని సేద్యము చేయుచున్నారు. పాశ్చాత్యదేశములలో నవీనపద్ధతి ననుసరించి తక్కువ విస్తీర్ణముగల భూమిలో నెక్కువ పంట పండించుచున్నారు. మనరైతులకు కొలదిగ శాస్త్రపద్ధతుల నలవడజేసినయెడల తమపద్ధ

తుల నభివృద్ధిచేసికొని లాభమును పొందగలరు. వ్యవసాయమునకు సహాయముగా గృహపరిశ్రమలు ఇంకను కొన్ని నిలిచియేయున్నవి. నడుకుట, నేయుట, అద్దకముచేయుట, తివాసీలు నేయుట, బుట్టలు అల్లుట, బొమ్మలు చేయుట, వడ్రంగము, కమ్మరము, చెప్పులుకుట్టుట మొదలగునవి శాస్త్రపద్ధతుల నభివృద్ధిపరచినయెడల దేశము సుభిక్షమై వెలయగలదు.

రెండవది పౌరసత్వపు హక్కు బాధ్యతల నలవడజేయునది. హిందూదేశప్రజలు సహజముగ తెలివైనవారు. వారియందు వ్యవహార దక్షత, విమర్శనాజ్ఞానము కలదు. అట్టివారికి కొలదిగ దేశచరిత్రము, భూగోళశాస్త్రము, అర్థికరాజకీయశాస్త్రములను బోధించినయెడల రాబోవురాష్ట్రీయ స్వపరిపాలనమును సమర్థతతో నిర్వహింపగలరు. మూడవది ఆరోగ్యసంరక్షణకు వినియోగపడునది. మనపూర్వులు తమగృహములను, ఉపకరణములను, పరిసరప్రాంతములను శుభ్రముగా నుంచుకొని ఆరోగ్యవంతులై యుండెడివారు. సాధారణరోగముల కిండ్లలో స్త్రీలే గృహవైద్యము చేసి పాపుకొనెడివారు. ప్రస్తుతము చిన్నజబ్బులకు సయితము డాక్టరులను వెదకికొనుచు పట్టణములకు పోవలసినవారైరి. ప్రతిమనుజుడును శరీరమునకు తగిన వ్యాయామము చేయుచుండవలెను. లేనియెడల శరీరము జబ్బుస్థితిలో ప్రవేశించును. వారికేకాక వారిసంతానమునకు కూడ చాల నష్టదాయకము. కావున కొలదిగ ఆరోగ్యశాస్త్రము, వ్యాయామశాస్త్రము, ఆయుర్వేదము నేర్పవలెను.

నాల్గవది ఆత్మవికాసమునకును, మనోవికాసమునకును ఉపకరించి మనుజుని ఆనందనిమగ్నునిగా జేయునది. మనుజుడు శరీరమునే గాక మనస్సునుకూడ సంతృప్తిపరచిన గాని సంపూర్ణానందము పొందజాలడు. అందుల కనువగు నీతి, మత, సాంఘికవిషయములను బోధింపవలెను. మనసారస్వతమునందు సద్గుణములను బోధింపగల గ్రంథము లనేకము లున్నవి. అట్టివి చదివింపవలెను. చదివి వినిపింపవలెను. కళలయందు కొందరికి ప్రీతి యుండును. అట్టివారికి వానిని సమకూర్పవలెను.

పైనిపేర్కొనబడిన నాల్గుతెరగతుల విద్యను జనులందరిలో వ్యాపింపజేయుటకు తగు మార్గములను నాకు తోచినంతవరకు మనవిచేయుచున్నాను. వయోజనవిద్య వ్యాపింపజేయుటకు గ్రంథాలయములు కొంతపని చేయవలసియున్నది. ప్రతిపట్టణమునందును వెంటనే పౌరజన గ్రంథాలయములను స్థాపింపవలెను. అధమము పెద్దగ్రామములందయినను తప్పక ఒక ధర్మ గ్రంథాలయము వెలయవలెను. గ్రంథాలయమునలన జదువను వ్రాయను నేర్చుకొనిన ప్రతివారును తమకు కావలసిన జ్ఞానమును పొందగలరు. గ్రంథాలయమునందే గ్రామములో నున్న పండితులవలన పురాణపఠనము నేర్పాటుచేయించవలెను. ఆంధ్రాంగ్లవిద్యను కొంతవరకభ్యసించిన విద్యార్థులలో సేవాపరత్వము చాల గలదు. అట్టివారిని ప్రోత్సాహపరచి రాత్రిపాఠశాలలను తెరచి జనసామాన్యములో అక్షరజ్ఞానమును వ్యాపింపజేయవచ్చును.

రెండవది సంచారగ్రంథాలయముల మూలముగ అక్షరజ్ఞులకు గ్రంథములను అందింపవచ్చును. గ్రంథములేగాక పత్రికలుకూడ జ్ఞానమును వ్యాపింపజేయుటకు మంచి సాధనములు. ప్రతి జిల్లాబోర్డుసహాయమున గ్రంథాలయములపేటికలను తయారుచేయించి చదువరు లున్న ప్రతి గ్రామమునకును పంపవచ్చును. ఈపని స్థానిక

సంస్థలకు మిక్కిలి సులభము. వలననగా చాల గ్రామములలో ప్రయిమరీ పాఠశాలలున్నవి. అందు పెక్కురు దేశాభిమానులగు యువకులు ఉపాధ్యాయులుగా నున్నారు. వారు గ్రంథవ్యాపనను సంతోషముతో చేయగలరు. తాలూకాబోర్డులు ప్రతి వత్సరమును కొంత ధనమును ప్రయిమరీ, సెకండరీ విద్యకొఱకు వెచ్చించుచున్నారు. బాలబాలికలు పాఠశాలలో నేర్చుకొనినవిద్య పాఠశాల వదలిన పిమ్మట వృద్ధిపొందించుకొనుమార్గములులేక క్రమముగా చదువుటగూడ మరచిపోవుచున్నారు. అందువలన లోకలుబోర్డులును, మ్యునిసిపాలిటీలును సంచారగ్రంథాలయములను పోషించుట తమ విధిక్రింద భావించవలెను.

తాత్కాలిక పాఠశాలల మూలమున విద్య గఱపుట మూడవ పద్ధతి. పాశ్చాత్యదేశములలో తాత్కాలిక పాఠశాలల నెట్లు నడుపుచున్నారో పైని వివరించియుంటిని. మన దేశమున కనుకూలముగు కొలది మార్పులతో దాని ననలంబింప వచ్చును. నాల్గవ పద్ధతి విడియుపన్యాసముల నిప్పించుట. అక్షరజ్ఞానము లేని జనసామాన్యము మన దేశమున విస్తారముగా గలదు. అట్టివారిని ముందు మనము గమనింపవలెను. ఈ పనిని సక్రమముగా నెరవేర్చుటకు బలిష్ఠమైనట్టియు, ధనసంపద కలిగినట్టియు సంస్థ దీనికి పూనుకొనవలయును. 1926 సం॥న మన ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ఉపన్యాసకులను తయారుచేసి గ్రామములవెంట బంపుటకు ప్రయత్నములు చేసియున్నారు. కొన్నిలోకలుబోర్డులును, మ్యునిసిపాలిటీలును ధనసహాయముచేయుటకు వాగ్దానము చేసియున్నవి. తిరిగి ఆయుద్యమము మేకారణమువలననో విరమింపబడెను. ప్రస్తుతము చిన్నయెత్తుననైనను ఆంధ్రదేశగ్రంథాలయసంఘమువారు మండలసంఘముల సహాయముతో పని ప్రారంభింపవలెనని కోరుచున్నారు. విషయములు ప్రజాసామాన్యమునకు సులభగ్రాహ్యమగుటకు మాజికులాంతరు సాహాయ్యముతో ప్రదర్శించిన యెడల చూచువారు మిక్కిలి ఆనందించెదరు. దాని లాభమును పూర్తిగా పొందెదరు. దీనికంతకును ధన మెక్కడినుండి వచ్చునని నిరుత్సాహపడకూడదు. తగినవారీ యుద్యమము చేపట్టి సాగించినయెడ ధనమునకు లోటుండదు. దాతలు తమంతటనే బయలుదేరెదరు.

---

# గ్రామగ్రంథాలయోద్యమము — సంచారగ్రంథాలయములు.

( జటావల్లభుల పురుషోత్తంగారు, ఎం. ఏ.)

ప్రజలకు చదువుచెప్పి పుట్టిననేగాని గ్రంథాలయములు స్థాపించుటకు వారు కడంగరు. గ్రంథాలయము లెదుటగ గాన్పించుచున్ననే కాని ప్రజలదృష్టి గ్రంథపఠనముపైకి పోదు. ఈ యన్యోన్యాశ్రయదోషమును నివారించుటకు సంచారగ్రంథాలయములు మిగుల సమర్థములు. అనేకగ్రామములకు గలసి యొక సంచారగ్రంథాలయము చాలును. ఇట్టిసంచారగ్రంథాలయములు గ్రంథముల నుచితముగ ప్రజలయిండ్లకు దీసికొనివచ్చును. కావ గ్రంథములను చదువువారిసంఖ్య చాల నుండును. ఈవిధముగ గ్రంథపఠనమునకు ప్రజ లలవడిన పిమ్మట వారంతట వారే తమతమ గ్రామములలో గ్రంథాలయములను స్థాపించుకొందురు. ఈ విధముగ సంచారగ్రంథాలయములు గ్రామగ్రంథాలయములకు బీజములు కాగలవు.

ఇట్లు గ్రంథాలయములసంఖ్య పెరుగుటతో బాటు మఱొకలాభముగూడ గలుగును. అది యేదన, సంచారగ్రంథాలయములు సహజముగ రాష్ట్రములోని లేదా జిల్లాలోని విద్యాధికులును దేశభక్తులును, ననుభవశాలురును నగు పెద్దల చేతులలోను నుండును గాన గ్రామవాసులచే నేయేవిధములగు గ్రంథములను చదివింపవలెనో యా విద్యాధికులే నిర్ణయించి తమ సంచారగ్రంథాలయములలో సత్కృష్టగ్రంథములకు మాత్రమే తా వొసగి వానినే ప్రజాళి కంద చేయుచు ప్రజలకు ప్రస్తుతము సాధారణముగ నున్న పనికిమాలిన గ్రంథములపై వ్యామోహమును పోనణచగలరు. ప్రస్తుతము మనదేశమున కేవిధమగు గ్రంథము లవసరమో యెఱుగకుండగనే నేడు గ్రామగ్రంథాలయస్థాపకులును, పాఠకులును వర్తించుచున్నారు గదా! దేశము లట్టుడిగిన ట్లుడిగి పోవుచుండగ నవలలతోను నాటకములతోను కాలక్షేపము చేయువారి నేమనవలయును? ప్రస్తుత మన్నివిషయములకంటెను రాజకీయార్థిక విషయముల కెక్కుడు ప్రాముఖ్యము రావలసి యున్నది. భారతదేశము జాతిగ నేర్పడవలసి యున్నది. పౌరసత్వపు హక్కులు మున్నగు విషయము లెన్నియో ప్రజలకు తెలియవలసి యున్నవి. ఆవిషయములకు సంబంధించిన గ్రంథములు విరివిగ రచింపబడి దేశముపై వెదజల్లబడవలెను. ప్రస్తుత మట్టిగ్రంథములు రచింపబడుచున్నను వానిని కొనువారు లేరు. గ్రంథాలయములలో కూడ నవలలు మున్నగు వానికి గల ప్రాముఖ్యము వీనికి లేదు. రోముపట్టణము మండుచుండగ నీరో అను నాయన పాడుచుండె ననునట్లు నేడు మన దేశ మిట్లుండ దీనిని జక్కజేయు సాధనముల నరయుటకు మారుగ మనము వినోదములకై పరుగిడుచున్నాము. దేశభక్తు లగువారు గ్రంథాలయోద్యమములో ప్రవేశించి ప్రజలు నేడు దేశకల్యాణమున కవసరమగు గ్రంథములను బ్రజలు చదివి పౌరసత్వపు హక్కులు మున్నగు వానిని గుర్తించుటయే కాక సమస్తవిధముల జాతీయతను పెంపొందించునట్లుగ గ్రంథాలయములను స్థాపించి వాని నుపయోగించుకొనునట్లు చేతురుగాక!

విజ్ఞానసంపన్నులీ యుద్యమమునకు గడంగుచో దేశములో నవసరమగు విజ్ఞానము ప్రబలుటయే కాక సద్గ్రంథకర్తలకుగూడ ప్రోత్సాహము గలుగును.

# చెన్నపురి ఆంధ్రనగరము కాదా?

శ్రీ బుర్రా శేషగిరిరావుగారు, శ్రీభారతీతీర్థప్రధాని.

మన దాక్షిణాత్యుల కనేకులకు చెన్నపురి యరవవారిదే యనియు నం దాంధ్రులు వలస వచ్చిన పరదేశులనియు నభిప్రాయము గలదు. కాని ఇది కేవలము భ్రమ. చెన్నపురి యసలు చరిత్ర ఆంధ్రసాహిత్యములో గలదు. చెన్నపురిని తొలుదొల్త స్థాపించినవారు ఆంధ్రులు, పద్మనాయక వెలమలు, వేంకటగిరిమహారాజవంశము వారిబంధువులు, మేనమామలు, రాజ్యాధిపతులు దామెర్లవారు. వీరిలో దామెర్ల అంకభూపాలుడను వీరుడు రచియించిన "ఉషాపరిణయము" అను అయిదాశ్వాసముల ప్రబంధములోని వంశవర్ణమున నీ చెన్నపురి కట్టిన వృత్తాంతము గలదు. కృతికర్తగారిసోదరుడు దామెర్ల వేంకటభూపాలుడు చెంజీ (జింజీ) నగరమును జయించి తమతండ్రి చెన్నభూవరుని పేర "చెన్నసముద్రము" అను పట్టణము కట్టించెను. వీరి మరియొక సోదరుడు అయ్యనృపతి తమతండ్రి పేర ప్రళయకావేరీ (పులికాటు) మైలాపురముల మధ్య "చెన్నపట్నము" కట్టించెను. ఈయంశములీ "యుషాపరిణయము" న నిట్లు తెలుపబడినవి.

క. శంకరనిభయశు లోకభ
భయంకరసమదారివీరహారిన్ రణని
శ్శంకుని జెన్నేంద్రుడు చిన
వేంకటవిభు వంగమందు వెలయం గనియెన్.

మ. రహి నవ్వేంకటధారుణీరమణుం డొ
రా, తండ్రిపే రొప్పంగా
మహిం జిత్రం బగు చెన్నసాగరము ధ
ర్మస్ఫూర్తి గట్టించె న
త్యహరీశోదిత తేజుం గృష్ణఘనవా
హాధీశజున్ వాలి బ
ల్వహినే జెంజిరమాధ్యుం ద్రుంచి శుభలీ
లం గాంచె రామోన్నతిన్.

తే. ప్రళయకావేరి మైలాపురంబు గల్పి
తీరమునం బోర నది మట్టుపెట్టం దండ్రి
పేరం దన్మధ్యభూమినిం బృథువిభూతి
నలవరిచెం జెన్నపట్టణ మయ్యన్నృపతి.

ఈదామెర్లవారిది రాజ్యాధిపవంశమని యీ క్రిందిపద్యమందు గలదు:

క. ఏవంవిధకీర్తిమహా
ప్రావృతహరిదంతధరణిపాలకపటలీ
పావనదామెరవంశకు
భావహవీక్షునకు దేవతాధ్యక్షునకున్.

వీరియింటియాడుపడుచును వేంకటగిరి శ్రీ వెలుగోటివారి కిచ్చినట్లు:

చ. గుణనిధి వేంకటమ్మ వెలి
గోటికులాంబుధిపూర్ణిమానుధా
ఘృణి యగు రంగభూపమణి
కిన్ సహధర్మిణియై జగజ్జన
ప్రణుతుం గుమారరంగనర
పాలు మహామహు నేచభూధవా
గ్రణి రణశూరు సింగవిభుం
గాంచెం గుమారుల మేరుధీరులన్.

ఇంతకు పూర్వతరములో శ్రీవెలుగోటివారి యాడుబిడ్డను వీరిపూర్వులలో నొకరి కిచ్చినట్లు:

క. వెలుగోటితిమ్మభూధవు
వలనన్ జనియించినట్టి వనితామణి వేం
గళసాధ్వి ని ధర్మప్రభు
తిలకుం డుద్వాహమయ్యె ధీరస్తుతుండై.

అను పద్యములో శ్రీ దామెర్ల ధర్మప్రభుని గూర్చి కలదు.

ఇందువలననే గాజులు, నేటికిని వేంకటగిరి ప్రభు వంశీయులకు చెన్నపురివారి జీవితమందు మమకారము కనబడుచున్నది. చెన్నపురి యాంధ్రులు కట్టినది. ఆంధ్రులు రాజ్యము చేసిన స్థలము ఆంధ్రులదే. అరవలే వలస వచ్చినవారు.

---

# పుస్తకజ్ఞానము.

పుస్తకములు జ్ఞానభాండారములు. మన జ్ఞానాభివృద్ధి కవి అత్యధికసహాయకములు. అయినను బాలురశిక్ష కవియే సర్వోచ్చస్థానములు కావు. స్వాభావికసాధనములుకూడ కావు. ఎందు కనగా - వానియం దుత్పాదకశక్తి లేదు. అవి కేవలము సహాయసాధనములు. సాధ్యము లెట్లగును? సూక్ష్మదర్శక యంత్రములు, దుర్భిణీయంత్రములు, కన్నులకు సహాయపడుచున్నవి. అనేకసమయములలో మన కాశ్చర్యకరముగ తోడుపడుచున్నవి. కాని వాని ప్రయోజనముపై నాధారపడి కన్నుల యుపయోగమును తక్కువ చేసికొనము. అట్లే ఆ యంత్రములను బహిష్కరించుటయు లేదు. మన జ్ఞానప్రవాహామునకు పుస్తకము లాదిమూలములు కావు. అవి నేత్రమునకు ఉపనేత్రములు, లేక సూక్ష్మదర్శక యంత్రములు. మన స్వాభావికజ్ఞానమునకు మూల మేది? జీవనముయొక్క అనుభవము, మననము, విచారము, పిమ్మట మనకార్యములు, మనల ననుభవవేత్తల జేయును. వీనిని వెంటనిడుకొని జీవనమార్గముపై నడచు మానవునకు పుస్తకములు సహాయముచేయును. అపరిశుద్ధము నశుద్ధము చేయును. సంకుచితమును విస్తృతము చేయును. ఇంతేకాని అనుభవశూన్యుడైన మానవునకు పుస్తకములు నిరర్థకములు. బంజరు భూమిపై వర్ష మెట్టిప్రభావమును పడవేయును?

పుస్తకములు పద్యమయము లగుటచేత కొంచె మస్పష్టముగా నుండవచ్చును. కాని. అవి సత్యమున కతిసమీపములు. ధాతువుయొక్క పరిజ్ఞానము లేనివానికి భూగర్భశాస్త్ర మెందుకు? అట్లే శ్రద్ధాభక్తులు లేని మోటు జనునకు ధార్మికసిద్ధాంతము హృదయము నంటదు. ఈ విధముగనే గద్యపద్యమయ సాహిత్యము మోటుపండితుని సుశిక్షితుని జేయజాలదు. ఎందు కనగా జీవితానుభవములో లేదు. పుస్తకజ్ఞానము కేవలఛాయామాత్రము లేదా ప్రతిధ్వనితో సమానము. అనుభవమున నార్జించిన సత్యజ్ఞాన మట్టిది కాదు. అది విచారశీలుని యంతఃకరణము నుప్పొంగజేసి లీన మొనర్చుకొనునట్టిది.

ఈ యనుభవము ఇంగ్లండు మొదలగు దేశములలో చాల తక్కువ. అమెరికనుల ధ్యానము మాత్ర మీవంక కాకర్షింపబడినది. **1922** వ సం॥రమున అమెరికాయం దొక సంచార శిక్షణాలయ మేర్పాటు చేయబడినది. ఫలితమును పరీక్షించుటకే మొదలిది ప్రారంభింపబడెను. పరీక్ష సఫలమయ్యెను; "ఓమనీబస్ కాలేజి"యను పేరుతో ప్రకృత మొక గొప్పసంస్థ యేర్పాటుచేయబడినది. సంచారమూలముననే విద్యార్థులకు శిక్ష గఱపబడును. ఈ కాలేజీకి పుస్తకము లేవియులేవు. మోటారు

"బస్సు"లు వారి గ్రంథములు. ఈ "బస్సు"ల లో కూర్చుండి యిచ్చటి విద్యార్థులు నానావిధ విషయజ్ఞానమును సిద్ధింపజేసికొందురు. ఉదాహారణమున కొక్క విషయము: సామ్యవాద పద్ధతి నభ్యసింపవలె ననుకొందము. విద్యార్థులు తమ యధ్యాపకులతో కూడ పెద్ద పెద్ద నగరములకు వెళ్ళి అచ్చట నిర్ధనులు, శ్రమకరులున్న తావు చేరుదురు. వారిజీవన వైచిత్ర్యము ననుభవము గావించుకొని సమస్తసమస్యల నధ్యయనము చేయుచు, పూర్ణజ్ఞానమును సంపాదింతురు.

భూతత్త్వ విజ్ఞానవర్గవిద్యార్థి దాని తత్త్వ రహస్యము మఱుగువడి యున్న చోటికి వెళ్ళి నిరీక్షించును. సమస్తవిషయములందిట్లే నిర్వర్తించి యీసంస్థ అల్పకాలమునందే వేలకొలది విజ్ఞులను తయారుచేసినది. దిన ప్రతిదినమున కాశ్చర్యకరమైన యున్నతి నందుచున్నది.

నిర్జన ప్రదేశములందు మైదానములో "అధ్యయన" మొనర్చుట మన ప్రాచీనార్యుల పద్ధతి. భారతవర్ష ఋషులు మునులు, తమ శిష్యులకు, వనములందు, పర్వతప్రదేశములవట్టున, నదులయొద్దున శిక్ష నొసగుచుండిరి. ప్రకృతి యొడిలో నుంచుటయే వారి ప్రధానోద్దేశము. ఇప్పటి యార్యగురుకులములు, కవిరవీంద్రుని శాంతినికేతనము ఇట్టి ప్రణాళికలోనివే! ప్రాచీనార్యులశోభ యిచ్చట కాననగును. చెట్లక్రింద పచ్చని మైదానములలో చదువుచున్న గురుకులబ్రహ్మచారులు ప్రాచీనఋష్యాశ్రమ "తేజఃకణములు" గా నగపడుదురు. ప్రకృతివిద్యాప్రణాళిక, సౌధములవయి కుర్చీలలో విద్యార్థులను చేరగిలబడ వేయుచున్నది. మహాభోగబద్ధస్పృహ కది ప్రథమనిదర్శనము. ఈరీతికి తిలాంజలి విడువవలెను. విశాల వనభూములలో నిరీక్షణముమూలమున విద్యాప్రాప్తి నొంద బ్రయత్నింపవలెను. కాని కేవల పుస్తకముల మూలమున గాబోవునది లేదు. పుస్తకము లేమనుష్యునిగాని సఫలుని చేయజాలవు.

కేవలము పుస్తకజ్ఞాను లయినందుననే మన వారు కన్నులు తెరచి నడచుచుండికూడ దేనిని గాని చూడజాలకున్నారు. అవగాహన మొనర్చుకొనజాల కున్నారు. దీనికి కారణ మిది: తక్కిన యింద్రియములకువలె నయనములకు 'శ్రమశిక్ష' లేదు కావున మన స్వాభావిక నిరీక్షణశక్తి రానురాను క్షీణించిపోవుచున్నది. కాలేజీలలోను పాఠశాలలలోను పదార్థజ్ఞానమునకే ప్రథమస్థాన మిచ్చుటకూడ మిక్కిలి యువసరము. పుస్తకములు, పరీక్షలతో విద్యార్థుల, జీవనానుభవమును తుడిచివేయుట నిర్జీవప్రతిమలను తయారుచేయుట కావున పాఠశాలలు విద్యార్థులకు కేవలము పుస్తకజ్ఞానముననేగాక అనుభవమూలమున బోధనలు సలుప ప్రయత్నింపవలెను. —సాధన పత్రిక.

---

# గ్రంథాలయములకు విరాళములు

## 1934—35 సంవత్సరమునకు ప్రభుత్వమువారి సహాయము

చెన్న రాష్ట్ర ప్రభుత్వమువారు ఈ సంవత్సరము గ్రంథాలయములకు ప్రజాకృపిచే నడుపబడుచు 1860 సంవత్సరపు నెం. 21 రు చట్టముప్రకారము రిజిష్టరైనవానికి, 19,450 రూపాయలు విరాళము లొసంగిరి. ఇందు ఆంధ్ర మండలముల భాగము 8695 రూపాయలు,

అన్నిమండలములందలి గ్రంథాలయములకును కొద్దియో గొప్పయో విరాళములు వచ్చెను గాని అనంతపురము మాత్రము గాన్పించుట లేదు. అచటనుండి దరఖాస్తులు రాలేదు గాబోలును. మొత్తము రాష్ట్రమంతటను 97 గ్రంథాలయములకు మాత్రము విరాళము లీయబడినవి. ఇందు ఆంధ్రమండలములలోనివి **44** గ్రంథాలయములు.

ఈగ్రాంటుల డబ్బు వ్యయమును జూపినపిదప నీయబడును. ఈడబ్బును పుస్తకములకే ముఖ్యముగ ఉపయోగింపవలెను గాని భవన నిర్మాణమున కుపయోగింపరాదు.

స్థానిక సంస్థలక్రిందను, ఇతర సంఘముల క్రిందను గల గ్రంథాలయములకు కావలసిన పుస్తకము లేవో ఆపట్టికను ధరలతో జిల్లావిద్యాశాఖాధికారియంగీకారమును బడయవలెను. సహకారసంఘములు పోషించు గ్రంథాలయములు తమజాబితాలను సహకార సంఘముల రిజిస్ట్రారుఅంగీకారములకు బంపవలెను.

ప్రభుత్వమువారెంత యిచ్చుచున్నారో ఆమొత్తమునకు సరియైనదానిని తాముగూడ ఖర్చుచేయవలసియుండును.

స్థానికసంస్థలుగాని యితరసంఘములుగాని తమ కుండు డబ్బులోనుండి, చందాలలోనుండి మాసపత్రికలు కొనుటకును, పుస్తకములను బైండు కట్టించుటకును, పట్టికల నచ్చొత్తించుటకును జేయుఖర్చు గ్రాంటుతో సమముగ ఖర్చు చేయవలెనన్న మొత్తమున జేరగలదు. కాని సిబ్బందికిని, వార్తాపత్రికలకును, భవనములను బాగుచేయించుటకును అగుఖర్చు ఇందు జేర్పవీలులేదు.

ఇందుతో జతపరుపబడిన మొత్తములను సరియైన వోచర్లు జూపినపిదప స్థానికసంస్థలకును, సహకారసంఘములరిజిస్ట్రారునకును స్వాధీనము చేయవలసినదిగ అక్కౌంటెంటు జెనరలుగారికి ఉత్తరువు లొసంగబడినవి.

ఈమొత్తము **1334-35** సివిలుబడ్జెటు అంచనాలలో గ్రంథాలయములకు ప్రత్యేకించబడిన 20 వేలనుండి యీయబడును.

ఆంధ్రమండలములందు విరాళములను పొందిన

గ్రంథాలయములు

బళ్లారి మండలము

| | |
|---|---|
| డైమండుజూబిలీ లైబ్రరీ మునిసిపలు హైస్కూలు, ఆదోని | రు 200 |
| మ్యునిసిపలు పబ్లికులైబ్రరీ, బళ్లారి | 200 |
| సన్మార్గ థియాసాఫికలు లాడ్జి ఫ్రీ రీడింగు రూం అండ్ లైబ్రరీ, బళ్లారి | 200 |

చిత్తూరు మండలము

| | |
|---|---|
| గాంధి రీడింగురూము అందు చిన్నగజైవీధి రీడింగురూం, తిరుపతి | 400 |

కడప మండలము

| | |
|---|---|
| జిల్లాబోర్డు లైబ్రరీ, కడప | 350 |

గంజాం మండలము

| | |
|---|---|
| కృష్ణసింహపతిగరు లైబ్రరీ, ఆస్కా | 150 |
| కోఆపరేటివు సెంట్రలుబ్యాంకిలైబ్రరీ, ఆస్కా | 100 |
| మ్యునిసిపలు పబ్లికులైబ్రరీ, బరంపురం | 300 |
| కనకమంజరి లైబ్రరీ, బోయిరాణి | 300 |
| శ్రీరామకృష్ణ సేవాశ్రమ గ్రంథాలయం- ఇచ్ఛాపురం. | 200 |
| పబ్లికు లైబ్రరీ, కళ్లికోట | 200 |
| జిల్లాబోర్డు లైబ్రరీ, రంభ | 300 |
| జగన్నాధ పతిగరు లైబ్రరీ, సురడ, | 200 |

తూర్పుగోదావరి మండలము

| | |
|---|---|
| ఆలమూరు సహకార భూమితనఖా బ్యాంకు లైబ్రరీ | 200 |
| శ్రీ ఈశ్వర పుస్తక భాండాగారం | 200 |

పెద్దాపురం మ్యునిసిపలు శ్రీ రీడింగురూం అండ్ లైబ్రరీ 250

పశ్చిమగోదావరి మండలము

యంగుమెన్సు హిందూ అసోసియేషను శ్రీ రీడింగురూం అండు పబ్లికు లైబ్రరీ, ఏలూరు 200
నందనారు లైబ్రరీ మల్లవరం, పెదలంక 100
జిల్లాబోర్డు లైబ్రరీ తాడేపల్లి గూడెం, 350
తణుకు 200
హార్డింజిహాలు లైబ్రరీ, తణుకు 150

గుంటూరు మండలము

గుంటూరు శ్రీకృష్ణ థియసాఫికలు లాడ్జి రీడింగు రూం 200
మునిసిపలు లైబ్రరీ, నరసారావుపేట 300
సరస్వతీ లైబ్రరీ, ఒంగోలు 150
మునిసిపల్ లైబ్రిరీ, తెనాలి 400
శ్రీ జార్జికార్నేషను రీడింగురూం, వినుకొండ 120

కృష్ణామండలము

రామమోహన లైబ్రరీ రీడింగురూం, బెజవాడ 400
రామచంద్ర పుస్తకభాండాగారం, బెజవాడ 400
శ్రీ విజ్ఞానవర్ధని పుస్తక భాం., భట్లపెనుమర్రు 100
శ్రీచంద్రమౌళీశ్వర పు. భా. బొబ్బెర్లపాడు 100
శ్రీ రామమోహన లైబ్రరీ, ఘంటసాల 200
యస్.ఆర్.బి.బి. గ్రంథాలయం, కొణకంచి 200
అర్తమూరు లోకలు కోఆపరేటివు యూనియను లైబ్రరీ, ముంజులూరు 25
నూజివీడు శ్రీ రావురామాయన రావుబహాదూరు స్త్రీల లైబ్రరీ 50
విక్టోరియా టౌనుహాలు అండ్ సోషలుక్లబ్బు లైబ్రరీ, నూజివీడు 50
శ్రీ వేణుగోపాల గ్రంథాలయం, తమిరిశ 200

కర్నూలు మండలము

మ్యునిసిపలు లైబ్రిరీ, కర్నూలు 100
విక్టోరియా రీడింగురూం అండు ఎడ్వర్డు కార్నేషను లైబ్రిరీ, నంద్యాల 200

నెల్లూరు మండలము

బలిజసంఘం లైబ్రిరీ, నెల్లూరు 125
ముస్లిం అంజుమాను అసోసియేషను లైబ్రిరీ, నెల్లూరు 150
ప్రోగ్రెసివు యూనియను లైబ్రిరీ, నెల్లూరు 200

విశాఖపట్న మండలము

శ్రీ మహాదేవ గ్రంథ నిలయం, పొందూరు 150
కాంబెలు లైబ్రిరీ, విశాఖపట్నం 125
లార్డు వెన్లాకు పబ్లికు లైబ్రిరీ, విజయనగరం 200

మద్రాసు కార్పొరేషను

మహమ్మడను పబ్లికు లైబ్రిరీ, వాలాజారోడ్డు, మదరాసు 400
హెల్తు ప్రోపగాండా బోర్డు లైబ్రరీ, ఎగ్మూరు 250
థియసాఫికలు సొసైటీ లైబ్రిరీ, ట్రిప్లికేను 150
సౌతు ఇండియను రేషనలు అసోసియేషను అండు రానడే లైబ్రరీ, మైలాపూరు 400
మద్రాసు ప్రావిన్షియలు కోఆపరేటివు యూనియను లైబ్రిరీ, రాయపేట 200
గవర్నమెంటు టెలిగ్రాఫు ఎంప్లాయీసు కోఆపరేటివు సొసైటీ, మద్రాసు 100

ఆంధ్రదేశమునందు ఆదర్శకముగా పనిచేయుచు, సహాయము పొందవలసిన అనేక గ్రంథాలయములు ఈ సహాయమును పొందక దిగబడియున్నవి.

# శ్రీ దేశోద్ధారక ఆంధ్ర భాషా నిలయము

కుకునూరు, (పాల్వంచ సంస్థానము - నిజాంరాష్ట్రము)

## దగ్ధగ్రంథాలయ పునరుద్ధరణము

మన్నెపు ప్రాంతములందు, అన్నివిధముల వెనుకబడియున్న ఆంధ్రసోదరుల విద్యావైజ్ఞానికాభివృద్ధుల కల్గించుటకు ఈపై గ్రంథాలయము క్రోధనసంవత్సరాదిని స్థాపించబడి ఎటుల భాషా ప్రబోధ మొనరించుచు కృషి సల్పుచున్నది ఆంధ్రమహాజనుల కందరికిని విదితము. ఇంకెంతయో అభివృద్ధికి రానున్న స్థితిలో దురదృష్టవశమున ప్రజోత్పత్తి సం॥ర చైత్రమాసమున, అమూల్యములును, అపూర్వములును, అలభ్యములునగు 2700 సంస్కృతాంధ్రాంగ్లగ్రంథములును, పెక్కు పత్రికాసంపుటములు, పరికరములు షుమారు మూడునాలుగు వేల రూపాయిలవిలువగల పై గ్రంథాలయసర్వస్వమంతయు పరశురామప్రీతియై అపారనష్టమును, విషాదమును తటస్థించినది. ఇట్టి నిరుత్సాహస్థితిలో, ఇక్కడ విద్యాభిమానుల తోడ్పాటు తక్కువగా నున్నప్పటికి, భవననిర్మాణముతో ఈదగ్ధగ్రంథాలయమును పునరుద్ధరింప సంకల్పించి పునఃప్రయత్నముల జరుపుచుంటిమి. 14వ ఆంధ్రదేశగ్రంథాలయమహాసభవారును, నిజాం రాష్ట్రాంధ్ర జనకేంద్రసంఘమువారును, మదరాసుగ్రంథాలయసంఘమువారును, సానుభూతి తీర్మానముల గావించి దేశీయులసహాయార్థము విన్నపముల ప్రకటించి చేయూతనొసంగిరి. మరియు ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమమున పేరెన్నికగన్న ప్రముఖులు విద్యాధికులు, పండితులు కొందరు, ఈదగ్ధగ్రంథాలయ పరిస్థితిని వెల్లడించుచు ఆంధ్రమహాజనుల సహాయార్థము ఒక పెద్దవిజ్ఞాపనను ప్రకటించి మాపునఃప్రయత్నముల ప్రోత్సహించిరి. పెక్కురు గ్రంథకర్తలు గ్రంథమాలలు, పత్రికా కార్యాలయములు, భాషాసంస్థలు మావిన్నపముల నాలకించి గ్రంథసహాయ మొనరించిరి. ప్రస్తుతము గ్రంథాలయమున 1309 తెనుగుగ్రంథములు 78 సంస్కృతగ్రంథములు 116 ఇంగ్లీషుగ్రంథములు 147 ఉర్దూగ్రంథములు 5 హిందీగ్రంథములు మొత్తము 1650 గ్రంథములు సమకూడినవి. వీనిలో 1500 గ్రంథములు ఉచితముగా నొసంగబడియున్నవి. ఆంధ్రపత్రికాధిపతులును, దేశోద్ధారక, విశ్వదాత, జ్ఞానదాతబిరుదాంకితులునగు శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఈనిలయారంభమునుండియు తమ గ్రంథపత్రికాసహాయములచే ప్రోత్సహించుచు ఇంకెన్నియోవిధముల జేయూతనొసంగుచు, దగ్ధగ్రంథాలయసముద్ధరణమునకై, పత్రికా కార్యాలయము, ఆంధ్రగ్రంథమాలలోని పెక్కు అమూల్యగ్రంథములను, పత్రికాసంపుటములను అనుగ్రహించిరి. బెజవాడవాస్తవ్యులు శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, 'గ్రంథాలయోద్ధారక' శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యపంతులుగారు, శ్రీయుత దిగవల్లి వెంకటశివరావు పంతులు, బి. ఎ. బి. యల్. గారు బ్రహ్మశ్రీ చెరుకుపల్లి బుచ్చిరామశాస్త్రిగారు, ఏలూరువాస్తవ్యులు శ్రీయుత మైలవరపు పూర్ణానందశర్మగారు, ఆయుర్వేద భిషగ్వరులు ప్రాణాచార్య బ్రహ్మశ్రీ చీమలకొండ సూర్యనారాయణశాస్త్రిగారు, ఆచార్య రాయసం వెంకటశివుడుపంతులు, ఎం.ఏ.

గారు, శ్రీ కూచి నరసింహం కంతులు, బి. ఏ గారు, హైదరాబాదు వాస్తవ్యులు శ్రీయుత ఆదిరాజు సత్యనారాయణరావుగారు, శ్రీయుత పండిత ఆదిరాజు వీరభద్రరావుగారు, శతావధానులు శ్రీ శేషాద్రి రమణకవులు, శ్రీమతి చాట్రాతి లక్ష్మీనరసమాంబగారు, ఓరంగల్లు వాస్తవ్యులు శ్రీయుత అవంచ వెంకటాప్రివు, వకీలుగారు జటప్రోలు సంస్థానములోని కొల్లాపుర వాస్తవ్యులు శ్రీ వి. రామసుబ్బారాయుడు, బి. ఎ గారు, మదరాసువాస్తవ్యులు ఆంధ్రభాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు, బనారస్ వాస్తవ్యులు వేదతీర్థ సాహిత్యవిశారద శ్రీ బి. వి. వీరభద్రశర్మగారు మున్నగు ప్రముఖులును, విజ్ఞానచంద్రికా గ్రంథమండలి, మానవాదర్శగ్రంథమండలి, కాకరపర్రు సరస్వతీగ్రంథమాల, బళ్లారి శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల మున్నగు గ్రంథప్రకాశకులును, గోలకొండ పత్రికా కార్యాలయము, బెజవాడ ఆంధ్రగ్రంథాలయప్రెస్సు, బహుబలేంద్రనిగూడెం సరస్వతీ గ్రంథాలయం, నిజాంరాష్ట్ర ఆంధ్రజన కేంద్ర సంఘము, అభినవ సరస్వతీ పత్రికా కార్యాలయము మున్నగు సంస్థలును, చేసిన గ్రంథసహాయము గ్రంథాలయసముద్ధరణమునకు అమూల్యమై ముఖ్యాలంకరణమై తనరారుచున్నది. ఇంకను గ్రంథముల నుచితముగా నొసంగిన గ్రంథకర్తలు, కవిపుంగవులును, వాగ్దానము చేసిన మహనీయులును అనేకులు గలరు. పత్రికాధిపతులచే ఆంధ్రదినపత్రిక, గోలకొండ, త్రిలింగ, ఫెడరేటెడ్ ఇండియా, సరస్వతి, రెడ్డిరాణి, అభినవసరస్వతి, గ్రంథాలయసర్వస్వము, ఉషస్సు ఆంధ్రభూమి (సగంచందా), భారతధర్మ ఉచితముగా నొసంగబడుచున్నవి. భారతి, చిత్రగుప్త నిలయమునుండి తెప్పించబడుచున్నవి. సభ్యులవల్ల వచ్చుస్వల్ప మగు చందాలవల్లనే ఈ గ్రంథాలయకార్యక్రమము కొనసాగుచున్నదిగాని విశేషధనసహాయ మేమియు లేదు. ఈ దగ్ధగ్రంథాలయపునః ప్రయత్నములవల్లను, భవననిర్మాణము పూర్తి కాకపోవుటచేతను కొంత నిరుత్సాహమునకు కారణముగా నున్నది. భవననిర్మాణమునకు కొంతపని యైనది. మిగత పనికూడ పూర్తిచేయుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. త్వరితకాలములో పదియేండ్లు నిండిన యీ భాషానిలయ నూతన గృహప్రవేశ మొనర్చి తొల్లింటివలె భాషాసేవ చేయగలదని యాశించుచున్నారము. అట్టి శుభకల్యాణసిద్ధికి ఆంధ్రమహాజను లెల్లరు, ధనసహాయ మొనరించియు, గ్రంథపత్రికాసహాయము లొసంగియు, విజ్ఞానహితపరిషత్తులందు ఆంధ్రసోదరులయభివృద్ధికై జరుపబడుచున్న ప్రయత్నముల నాలకించి తోడ్పడ ప్రార్థితులు. ఈ దగ్ధగ్రంథాలయసముద్ధరణమునకు తోడ్పడిన మహనీయుల కెల్లరకు కృతజ్ఞతాభివందనము లర్పించుచు, పూర్వాభిమానముంచి ఈ భాషానిలయభావ్యభివృద్ధికి చేయదగిన సహాయసానుభూతు లొసగుచుండ వేడెదను. ఏసహాయమైనను ఈ క్రిందివిలాసమున కంపకోరెదను.

కుకునూరు,
కూనవరం పోస్టు,
తూర్పుగోదావరిజిల్లా.

ఇట్లు విన్నవించు, భాషాసేవకుడు,
కొ. వెం. రా. ల. నా. శర్మ.
సంస్థాపకుడు, కార్యదర్శి.

# శ్రీ వేంకటేశ్వర విలాస్ పుస్తక భాండాగారము

## ఉపమాక అగ్రహారము

ఈ గ్రంథాలయముయొక్క ద్వాదశవార్షికోత్సవము 1-11-34 తేదీని మ॥ రా॥ శ్రీ శాస్త్రరు, వి. వి. గిరి గారి అధ్యక్షతక్రింద మిక్కిలి వైభవముగా జరిగినది. పరిసరగ్రామములందు గల భాండాగారాభిమానులు చాలమంది దయచేసిరి. సభను ప్రారంభించుచు మహాభాష్యం సుబ్బారాయుడుగారు, బి.ఏ.యల్.టి గ్రంథాలయోద్యమమునుగురించి విపులముగా ఉపన్యసించిరి. అధ్యక్షులు గ్రంథాలయోద్యమమునందు తమకు గల ఉత్సాహమును తమ స్వంతఅనుభవములద్వారా తెలియపరచుచు విపులముగా ఉపన్యసించిరి. గుంటూరు దీక్షితులుగారు గ్రంథాలయముల ఉపయోగములగూర్చి ఉపన్యసించి సభ్యులను గ్రంథాలయములందు అభిలాష గలవారినిగా నొనర్చిరి. ప్రయాగ సత్యనారాయణగారు విగ్రహారాధనమునుగూర్చి విమర్శనపూర్వకముగా ఉపన్యసించిరి. శ్రీ తుని రాజావారి గురువులవారగు శ్రీమన్నల్లాని చక్రవర్తుల వరదవెంకటరంగాచార్యులు అయ్యవార్లంగారు సనాతనధర్మమునుగురించి సప్రమాణముగా ఉపన్యసించిరి. దిగుమర్తి రామస్వామిగారు (బి.ఏ.బియల్.) గ్రంథాలయములు దేశమునకు చేయుచున్న సేవనుగూర్చి ఉపన్యసించిరి.

### సంగ్రహానివేదిక

ఈ గ్రంథాలయము 12 సం॥రముల క్రితము 1922 సం॥రములో విద్యాభిమానులును, సుస్వభావులును అగు శ్రీమాన్ ఐ. వి. యల్ నృసింహాచార్యులు యమ్. ఏ., యల్. టి. గారిచే ఈ అగ్రహారమందు నెలకొల్పబడిన తిరువేంకట సంస్కృతపాఠశాలయందు అగ్రహారస్థులచేతను, ఉపాధ్యాయ, విద్యార్థిబృందముచేతను, తదితర పెద్దలచేతను నెలకొల్పబడి కొన్నికారణములచే 1933 సం॥రం, నవంబరు 1వ తేదీని పునరుద్ధరింపబడి యిప్పటివరకు అనుకూలాభివృద్ధి గాంచుచున్నది. ది 1-11-1934 సరికి గ్రంథములసంఖ్య 946. ది 1-11-33 లకు ది 31-10-34 ఆఖరుకు అయిన సం॥రములో పుస్తకములు చదివినవారిసంఖ్య 364. చదువబడినపుస్తకముల సంఖ్య 507. చందాదారులసంఖ్య 56. వసూలు మొత్తము రు 79-10-9. గత సం॥రం నిల్వ రు 21-11-7. ఖర్చు మొత్తము రు 89-14-9. కాశ నిల్వ రు 11-7-7. ఈసం॥రమందు రెండు హరికథలు, 2 ఉపన్యాసములు ఇప్పించబడినవి. గ్రంథాలయ ఉద్యమాభిమానులు సహాయముచేయ ప్రార్థితులు.

---

### సులభ్యవస్తు వైద్య బోధిని.

బందరు వాస్తవ్యులగు మ. రా. శ్రీ నాదెళ్ల పురుషోత్తమ కవిగారిచే సులభ్యవస్తు వైద్యబోధిని రచింపబడినది. ఇందు 120 రోగములు కలవు. శ్రీకవిగారు మిగుల శ్రమపడి వారి అనుభవముమీద ఈ పుస్తకము వ్రాసినట్లు వారి పుస్తకమువలన తెలియుచున్నది. ఈ పుస్తకమునందలి రోగములుచూడ యే వ్యాధియైనను కొద్దిడబ్బుతో నివారణకాగలదని తోచుచున్నది. వైద్యసహాయములేని గ్రామమునందలి ప్రతిగృహమందును, ఈ పుస్తకము ఉపయోగపడగలదు.

యీ గ్రంథము వలయువారు నాదెళ్ల పురుషోత్తమకవిగారు, బందరుఅని వ్రాసిన 6 అణాలు వెలకు బడయగలరు.

5—2—35, } బెజవాడ. } వైద్యవిద్వాన్ కం. విష్ణువర్ధనరావు, ఏ. ఆర్. ఏ. సి.

# గ్రంథాలయోద్యమము – విశాఖపట్టణమండలము

## సా లూ రు తా లూ కా ప్ర య త్న ము లు

ప్రపంచమీనూతనయుగమున నూతనపరివర్తనలకు లోనై సర్వత్ర నూతనవికాసము పెంపొందుచున్నది. నేడు సారస్వతయుగమునకు నూతనవికాస మేర్పడినది. సర్వత్ర సారస్వతసంఘములు, సారస్వతసమితులు స్థాపింపబడుచున్నవి. వాఙ్మయోద్ధరణమునకు యువకులెల్లరు, అచ్చటచ్చట తమశక్తికొలది పనిచేయుచున్నారు. అసహాయోద్యమమునకు పూర్వము మనమండలములో గ్రంథాలయోద్యమ వ్యాప్తి బాగుండెడిదిగాని నేడు చాల తక్కువైనది.

మనజాతియొక్క ఔన్నత్యముకొరకనేకోద్యమములు వెలువడి పనిచేయుచున్నవి. ఇందు కొన్ని సంఘసంస్కరణములకొరకును, కొన్ని మతప్రచారవ్యాప్తికిని, కొన్ని రాజకీయసంస్కరణములకొరకును, కొన్ని సారస్వతాభివృద్ధికిని సర్వతోముఖముగ అనేకవిధములగు పనులు చేయుచున్నవి. ఈయుద్యమములయొక్క అన్నిటి స్వభావమును గుర్తెరిగి వానిసిద్ధాంతములకు భేదము లేకుండునట్లు పనిచేయుచు గమ్యస్థానమునకు జేర్చు మహాశక్తి గ్రంథాలయోద్యమమునకు గలదని నుడివిన నతిశయోక్తి కానేరదు. దైవసంబంధమగు ఆలయమునకు దేవాలయమనియు; గ్రంథసముదాయంబున, వానిసంబంధమగు పరికరముల నుంచుదానికి గ్రంథాలయమనియు వాడబడుచున్నది. దేవాలయములోని దేవుడు మనకోరిక లిచ్చుట సంశయంబే కాని, గ్రంథాలయమట్లుగాక మనకు కావలసినకోరికను తత్క్షణము గ్రంథములద్వారా తీర్చుటకుసిద్ధముగా నుండును.

దేవాలయమందుండు దేవతలు ఆయామతస్థులకు, వానియనుచరులకు ఆయామతానుసారముగ ముక్తి నొసగునని చెప్పుచున్నారు. వైష్ణవులకు విష్ణ్వాలయములు, శైవులకు శివాలయములు, క్రైస్తవులకు చర్చిలు, మహమ్మదీయులకు మసీదులు మున్నగునవి ఆయామతము ననుసరించి గలవు. కాని, గ్రంథాలయంబు సర్వమతములకు సమ్మతస్థానంబై, పండితపామరులను భేదంబు లేక, జాతిమతపట్టుదలలు లేక, బీదవారు భాగ్యవంతులను భేదంబు లేక మానవుని సౌభ్రాతృత్వంబును, ఎల్లరును ఏకోదరులను భావము స్ఫురింప జేసియు, ఎవరికి కావలెనన్నకోర్కెలు వారి కొసంగుచు నైహికాముష్మిక సుఖంబుల ప్రసాదించునది, సుఖవంతులను జేయునది గ్రంథాలయోద్యమముకాదా?

స్వార్థత్యాగము, భాషాభిమానము, దేశాభిమానము, జాతీయజీవనము, నీతిప్రవర్తనము దాస్యవిముక్తిసాధనము మున్నగునవి చేకూర్చుటకు గ్రంథాలయోద్యమమే ముఖ్యసాధనమై యున్నదని తలంచియే ఈమా "శ్రీరామ గ్రంథాలయము"ను 1921-సంవత్సరమున నీశివరామపురాగ్రహారమున స్థాపించితిమి. దీనికి తొలుదొల్త నెట్టి ఆదాయమును లేదుగాని సోదరులు కొంతమంది తమకుతోచినరీతిని గ్రంథములు సాహాయ్యముచేసిరి. పిదప నేమియు ఆదాయము లేదని తలంచి 1923-సం॥ లో శ్రీరామ నైటుస్కూలు అనుపేరుతో నొకప్రాథమిక పాఠశాల స్థాపించితిమి. తన్మూలమునవచ్చుఆదాయమువల్ల, శ్రీరామగ్రంథాలయమును రెండు బీదబ్రాహ్మణకుటుంబములును పోషింపబడుచుండెను. దురదృష్టవశమున సదరు స్కూలును ఎడ్యుకేషనల్ కౌన్సిలువారుద్రవ్యసహాయలిష్టులోనుంచి తగ్గించిరి. ప్రతిసంవత్సరము

గ్రంథాలయసమితిమున దైవకార్యములు, వర్ధంత్యుత్సవములు జరుగుచుండెడివి. నేడు అట్టి ఉత్సవములు గ్రామస్థులసహాయమువల్లను జరుగుచున్నవి.

ముందుముందు శ్రీరామగ్రంథాలయమున గల, ప్రాచీనాధునిక గ్రంథములను శ్రీరామ గ్రంథమాల యను పేరిట ప్రచురింప నిశ్చయించితిమి. గతసంవత్సరము వార్షికోత్సవసమయమున జరిగినతీర్మానముననుసరించి ముందుగా ఒక సంచిక ప్రకటింపనెంచితిమి. భాషాభిమానులగు సోదరులు గద్యపద్యవ్యాసములు సదరు సంచికకొరకై పంపియున్నారు. కారణాంతరములచే సంచికను సకాలమునకు ముద్రింపలేక పోతిమి. ఈసంవత్సరము తప్పక సంచికను ప్రచురించుచున్నారము. మునుపటికంటె హెచ్చుగా పనిచేయదలచు కొన్నది స్పష్టమే. కాని బాగుగా పనిజరుగుటకు అర్థబలమేగాక, అంగబలముకూడ నుండవలెననితలంచి మన సాలూరు తాలూకాకు ముఖ్యపట్టణమగు సాలూరునందు శ్రీరామ గ్రంథాలయమునకు అనుబంధముగా "కవిమండలి" యను పేరుతో నొక భాషాసేవక సంఘ మొకటి స్థాపించియున్నారము.

అనుబంధముగా స్థాపించిన కవిమండలిని గూర్చి పత్రికలలో ప్రకటితమైయున్నది. సారస్వత సేవకే స్థాపించిరిగాని వేరువేరుసంఘములతో భేదాభిప్రాయములకొరకుగాని, పరస్పరవాదోపవాదములకుగాని కాదని మాసోదరులు గమనించవలెను. ఈసంఘమునకు సం॥ 1 కి రు 1-0-0 చందానిర్ణయించడమైనది. ఇందు భాషాభిమానులుకూడ సభ్యులుగ జేరవచ్చును.

కావున దైవానుగ్రహమువల్లను మీఅందరి ఆదరణవల్లను గ్రంథాలయము వృద్ధిలోనికి తీసుకరావలెనను సదుద్దేశము మీకు మనఃస్ఫూర్తిగానున్న యెడలను కవిమండలి కార్యదర్శియే దీనికిని కార్యదర్శిగావున మీరెల్లరు మన గ్రంథాలయసంఘమునందు సభ్యులుగ జేరి తగుసహాయము చేయగలందులకు, భాషాభిమానులను, ముఖ్యముగా సాలూరుపౌరులను కోరుచున్నాడను. అట్లు తామెల్లరు జరిగించుటకు నిశ్చయించినతక్షణమే "శ్రీరామాసర్కులేటింగులైబ్రరీ" స్థాపించి తన్మూలముగా భాషాసేవజేయ సంసిద్ధముగా నున్నానని మనవిచేయుచున్నాను. మరియు "శ్రీరామగ్రంథాలయము" యొక్క గృహ నిర్మాణమునకు నేను స్థలము నొసంగియున్నాను.

కావున మా 'శ్రీరామగ్రంథాలయమునకు' ప్రత్యేకగృహనిర్మాణమునకు ఆంధ్ర భాషాభిమానులగు ఆంధ్రులెల్లరు సహాయముచేయగలందులకు ప్రార్థించుచున్నాను. తాము జేయు సహాయము, వస్తురూపముగాగాని లేదా ధనరూపముగాగాని జేసి, సాలూరు తాలూకాకు ముఖ్యమగు నీగ్రంథాలయమును అభివృద్ధిలోనికి తెచ్చుటకు ఎల్లరుతోడ్పడవలెనని సవినయముగ ప్రార్థించుచున్నాను. మరియు మనవిశాఖ పట్టణ మండల గ్రంథాలయోద్యమ సంఘమువారు జిల్లాలో నుండు గ్రంథాలయముల వృత్తాంతములను కనుగొనుచు వానికి వలయు సౌకర్యములు చేకూర్చుటకు మండలగ్రంథాలయసంఘము తోడ్పడవలెనని హెచ్చరించుచున్నాడను. అప్పటప్పట మండల గ్రంథాలయసంఘము వారు అవసరమగు కరపత్రములు ప్రకటించి జిల్లాలో నుండు గ్రంథాలయము లన్నిటికిని ప్రోత్సాహము జేయుదురుగాక యనియు, గ్రంథాలయోద్యమమునుగూర్చి ప్రచారము గావింపవలెననియు

మండల గ్రంథాలయసంఘమువారి ముఖ్యకర్తవ్యమని మనవిచేయుచున్నాను. ఓం తత్సత్. సత్యమే జయించును.

గృహనిర్మాణమునకు సహాయముజేయదలచిన మహానుభావులు ఈక్రిందిచిరునామాకు పంపప్రార్థితులు.

—యామిజాల రామనరసింహము,

వ్యవస్థాపకుడు, శ్రీరామగ్రంథాలయము, పాలూరుతాలూకా.

---

# పురపాలక సంఘోచిత పఠనాలయము, పెద్దాపురము.

శ్రీ రాజా వత్సవాయి రాయజగపతివర్మగారు.

మా గ్రామమున ప్రజోపయోగ మయిన గ్రంథాలయమేదియు నిదివరకు లేకపోవుట వలన నేను పురపాలకసంఘములో ప్రవేశించిన వెంటనే ఉచితపఠనాలయ స్థాపనకు సర్వవిధముల కృషిచేసి, బెజవాడనుండి శ్రీవాణీముద్రాక్షరశాలాధికారులగు శ్రీయుత దాసు త్రివిక్రమరావు బార్-ఎట్-లాగారిని రప్పించి వారి అధ్యక్షతక్రింద పైపఠనాలయమును స్థాపింపజేసి యిప్పటికి మూడుసంవత్సరము లయినది. నేనే గౌరవకార్యదర్శిగ నుండి పఠనాలయమును నడపితిని. పురపాలకసంఘమువా రిందునిమిత్తము సాలుకు మూడువందలరూపాయీల వరకును ఖర్చుపెట్టుచున్నారు. దొరతనమువారు సాలుకు 250 రూపాయీలు ఈ యేటినుండి గ్రాంటు నిచ్చుటకు తీర్మానించియున్నారు.

ఇదిగాక యీ గ్రామమున లక్ష్మీసిల్కుఫ్యాక్టరీ ప్రొప్రయిటర్లు శ్రీ ముప్పనసోమరాజు వీర్రాజునన్నువారు కీర్తిశేషులైన శ్రీ పెద వీర్రాజుగారి మెమోరియల్‌గా ఒకబిల్డింగుకట్టించి యీపఠనాలయమున కిచ్చుటకు నేను కోరియున్నాను. అందుకు బొంబాయిలోని గొప్ప సిల్కు వర్తకులగు శ్రీ కంచర్ల జానకిరామయ్యగారు 500 రూపాయీలు విరాళ మిచ్చియున్నారు. ఇపుడు సిల్కునూలువర్తకులు యావన్మందియు చందాలు వేసుకొనుచున్నారు. ఈ గ్రామమునగల మానోజీచెరుల దగ్గర శ్రీ సారా సత్తిరాజు, రామచంద్రంగార్లు ప్రజోపయోగముగ ఒక బిల్డింగు కట్టుటకు దిమ్మ వేయించియున్నారు. ఆదిమ్మస్థలమును ఈ గ్రంథాలయమునకు లేదా మెమోరియలుకు నిచ్చుటకు సిద్ధముగ నున్నారు. చందాలవల్ల వచ్చిన సొమ్ముగాక మిగిలినసొమ్ము ఉదార స్వభావులగు శ్రీ ముప్పనసోమరాజు, వీర్రాజునన్ను, వారు ఈయగలరు. భగవదనుగ్రహమున రాబోవు వత్సరముకు గ్రంథాలయమునకు శాశ్వతమయిన బిల్డింగు దొరకగలదు. ఈ గ్రంథాలయమునకు ఆంధ్ర, కృష్ణా, హిందూ, ఇండియను ఎక్స్ప్రెసు, గృహలక్ష్మి, భారతి చిత్రగుప్త, నవ్వులరాణి, మున్నగు పత్రికలు వచ్చుచు ప్రతిదినము 50,60 మంది చదువరుల నాకర్షించుచున్నవి.

# గ్రంథాలయ నిర్వహణము

## ఉపాధ్యాయులకుగాను తరిబీతు ఏర్పాటు, 19-12-34 తేదీ

మద్రాసు విశ్వవిద్యాలయముయొక్క వైస్ ఛాన్సెలరగు ఆర్. లిటిల్ హేల్సుగారు 16-12-34 తేదీ సాయంకాలము సెనేటుభవనమున ఉన్నత పాఠశాలల ఉపాధ్యాయులకుగాను గ్రంథాలయ నిర్వహణ పాఠశాల నొకదానిని విద్యాశాఖామంత్రియగు గౌ. దివాన్ బ. ఎన్. కుమారస్వామి రెడ్డిగారి అధ్యక్షతను ప్రారంభ మొనర్చిరి.

శ్రీ. కే. వి. కృష్ణస్వామి అయ్యంగారు లిటిల్ హేల్సుగారిని గ్రంథాలయ పాఠశాల ప్రారంభోత్సవము జరుపకోరుచు నిటుల పలికిరి. ఉన్నత పాఠశాలలందు హైస్కూలు తరగతుల బాలురకు వారమునకొక గంటయైనను హైస్కూలు గ్రంథాలయములో చదువుతరగతిని స్థాపింపవలెనని పబ్లికు ఇన్స్ట్రక్షను డైరెక్టరు డబ్లియు. ఎర్లం స్మిత్ గారు ఒక ఉత్తరువు గావించిరి. అట్టి మంచి ఉత్తరవు గావించినందులకు వారు వందనీయులు. ఈయుత్తరువు రాష్ట్రమున విద్యాభివృద్ధికై ఎక్కువ తోడ్పడగలదని గ్రంథాలయముల సంఘమువారు తలచుచున్నారు. గ్రంథాలయముల కార్యములలో శిక్షణము ఉపాధ్యాయుల కొసగుటకు గ్రంథాలయసంఘమువారు ఈ క్రిస్మసు సెలవులలో కొన్ని ఉపన్యాసముల నొసంగుటకు ఏర్పాట్లుగావించియుండిరి. ఈప్రణాళికయొక్క విజయమునకు రెండువిషయములు ఆవశ్యకము. ఈకార్యములో ఉపాధ్యాయుల సాహాయ్యము ప్రభుత్వమునుండి ధనసాహాయ్యము కూడ వలసియున్నది. పాఠశాల గ్రంథాలయములందు కావలసినన్ని గ్రంథములు లేకున్నవి. పాఠశాలలలో విద్యార్థుల సంఖ్యకు తగినచోటు ఇతర సౌకర్యములుకూడ వారికి లేవు. పాఠశాలయొక్క గ్రంథాలయములు బాగుగ నిర్వహింపబడుటకు ప్రభుత్వమువారు ధన సాహాయ్యము చేయవలెనని ఉపన్యాసకులు విద్యామంత్రిగారిని కోరిరి.

### గ్రంథాలయములు-విద్యాభివృద్ధి

వైసు ఛాన్సలరుగారు గ్రంథాలయ పాఠశాల ప్రారంభోత్సవము గావించుచు నిటుల పలికిరి:—భారతదేశమున విద్యాభివృద్ధిగాంచుటకు గ్రంథాలయములు ముఖ్యసాధకము లని యీ దేశమున నింకను పూర్తిగా గ్రహింపలేదు. విద్యకు సాధనమగు నీ గ్రంథాలయములయెడల శ్రద్ధ అంతగా చూపుటలేదు. విద్యాభివృద్ధి కార్యములో గ్రంథాలయములు అంతగా సాహాయ్యపడలేదు. భారతదేశమున ప్రస్తుతము కళాశాలలందును, ఉన్నతపాఠశాల లందును సులభశైలితో వ్రాయబడి ఉపయోగకర మైన పుస్తకములు కావలసియున్నవి. ప్రతి ముఖ్యగ్రామమునందును, పట్టణమునందును ఆంగ్లభాష, జాతీయభాషలలో ప్రజలు గ్రంథములు చదువుటకు ఒక గ్రంథాలయమైనను నుండవలెను. జనసామాన్యమును విద్యావంతులుగ జేయునిర్బంధమైనప్రైమరీవిద్యావిధానము ఆవశ్యకమైన యటులనే గ్రామాదులందు గ్రంథాలయముల స్థాపించుటయు ఆవశ్యకము. ఈ గ్రంథాలయములుస్థాపించుటకు ధనమావశ్యకము. ఒకమంచి గ్రంథాలయమును బాగుగ నిర్వహించుటకు దానికి సమర్థుడగు గ్రంథభాండాగారి కావలెను. పెద్ద గ్రంథాలయములలో నియమింపబడుటకు గ్రంథభాండాగారులకు గ్రంథాలయ నిర్వహణ కార్యమునందు తగిన శిక్షణము నుండవలెను.

విద్యార్థులు గ్రంథాలయములో నుండు పుస్తకములను తఱచుగా వాడుచుండుట లేదని ఆరోపణ కలదు. వారు పఠనీయగ్రంథములలోని విషయములను కంఠతః నేర్చుకొను చెడ్డ అలవాటు కొంతవర కిందులకు కారణమైయున్నది. అదిగాక, భారతీయ విద్యార్థులకు తమ పఠనీయగ్రంథములుగాక వాఙ్మయములోని యితర గ్రంథములను చదువుటకు వలయు అభిలాష కాన్పించుట లేదు. గ్రంథాలయములు ఉపయోగకరముగ నిర్వహించుటకు అట్టి గ్రంథాలయములలోని పుస్తకములను విరివిగా వాడు అలవాటును విద్యార్థులలో ఉపాధ్యాయులు కలిగించవలెను.

గ్రంథాలయముల నిర్వహణ కార్యమున శిక్షణము ఉపాధ్యాయులకు నొసగుటకు నొక పాఠశాలను జరుప గ్రంథాలయసంఘమువారు పూనుకొని యున్నారు. ఈ కార్యములో గ్రంథాలయసంఘమువారి యత్నమును మద్రాసు విశ్వవిద్యాలయమువారు కృతజ్ఞతతో అంగీకరించియున్నారు.

మంత్రిగారు.

గ్రంథాలయముల ఉద్యమమును రాష్ట్రమునంతను ప్రసరింప చేసినందులకు గ్రంథాలయ సంఘమువారిని విద్యామంత్రిగారు అభినందించిరి. ప్రభుత్వమునుండి కోరబడిన ధనసాహాయ్యము ఈపరిస్థితులలో లభించుట కొంత కష్టమే యనిరి. ఈఉద్యమముపట్ల ప్రభుత్వము వారికి సానుభూతి కలదు. రిట్రెంచిమెంటువలన గ్రంథాలయముల కొసగబడు గ్రాంటులను కొన్నిటిని తగ్గించవలెనని యత్నము గావించినపుడు గ్రాంటులు యథావిధిగ నొసగబడుటకు పోరాడితిని. రాబోవువత్సరములలోకూడ ఈ గ్రాంటులు నొసగబడుననియే విద్యామంత్రి గారు ఆశించిరి.

బషీర్ అహ్మద్ సయ్యద్‌గారు వందనము లర్పించుటతో సభ ముగిసెను.

ప్రదర్శనము.

ఉన్నత పాఠశాలయందు 5, 6 ఫారములకు కావలసినట్టియు, పాఠశాలాగ్రంథాలయమున నుంచుటకు తగియున్నట్టియు గ్రంథముల ప్రదర్శనము దినమంతయు జరిగెను.

## తాడేపల్లితాలూకాయందు గ్రంథాలయోద్యమము

తాడేపల్లిగూడెం తాలూకా గ్రంథాలయ సంఘముయొక్క సమావేశము 27-1-35 తేదీల తాడేపల్లిగూడెంలో డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారి ఇంటియందు సమావేశమైనది. తాలూకాయందున్న గ్రంథాలయములను 7 గుత్తులక్రిందవిభజన చేసి, కార్యనిర్వాహక సంఘ సభ్యులలో ఒక్కొక్కరు ఒక్కొక్క గుత్తి యందలి గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతను వహించుటకును ఫిబ్రవరి నెలలో తాలూకాయంతటను సంచారకార్యక్రమమును నిర్ణయించుటకును, మార్చి నెలలో తాలూకాగ్రంథాలయసభ జరుపుటకును, ఏప్రియలు 1 వ తేదీ గ్రంథాలయ సంవత్సరాదిగ, వ్యవహరించుటకును, గ్రంథాలయసంఘమునందు చేరుసభ్యులుగాని గ్రంథాలయములుగాని సాలున కొక రూపాయ చందా నిచ్చుటకును, గ్రంథాలయసర్వస్వమును తెప్పించుకొనుటకును తీర్మానించిరి. ఈ తాలూకాలో 36 గ్రంథాలయము లున్నవి.

# ఆంధ్రనాయకులకు గౌరవబిరుదములు

## అఖిలభారత గ్రంథాలయసభ

ఆంధ్రపత్రిక యిట్లు వ్రాయుచున్నది:—

నిన్నమధ్యాహ్నము (25-121-934) రాయపేటలో కాంగ్రెసుహౌసులో మణీంద్రదేవరాయిగారి అధ్యక్షతక్రింద జరిగిన అఖిలభారత గ్రంథాలయసభలో పెక్కుతీర్మానములామోదింపబడెను. ఆంధ్రదేశమున భాషాభివృద్ధికి విశ్వదాత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారును, బ్రహ్మశ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులవారును చేయుచున్న ఘనతమమగు సేవను సభవారు చాల ప్రశంసించిరి. పంతులుగారికి జ్ఞానదాత యనుబిరుదమును శాస్త్రులవారికి భాషోద్ధారకబిరుదమును నిచ్చునట్టితీర్మానము సభలో నేకగ్రీవముగా నామోదింపబడెను. ఆంధ్రభాషాభివృద్ధికి తమసర్వస్వమును ధారబోయుచున్న పంతులుగారిని అనేకసంస్కృతాంధ్రగ్రంథములను ముద్రించి ప్రకటించుచున్న శాస్త్రులవారిని అఖిలభారత గ్రంథాలయ మహాసభవారీరీతిగా గౌరవించుటచే మహాసభవారు తమవిధిని మిక్కిలి బాగుగా నెరవేర్చినవారైరి. భాషాసేవకొరకు తమజీవితములను వినియోగించుచున్న భాషాసేవకులను భారత గ్రంథాలయ మహాసభవారిటుల గౌరవించుటవలన భాషాసేవ చేయుచున్నవారికి అధికమగు నుత్సాహమును ఇతరులు క్రొత్తగ భాషాసేవకు గడంగుటకు ప్రోత్సాహమునుగూడ కలుగగలదు గాన నిందులకు మేము మహాసభవారిని ప్రశంసించుచు జ్ఞానదాత నాగేశ్వరరావు పంతులుగారిని భాషోద్ధారక వేంకటేశ్వరశాస్త్రులవారిని మనఃపూర్వకముగా నభినందించుచున్నాము.

# ఆంధ్రదేశగ్రంథాలయ సంఘము - బెజవాడ

ఈసంఘముయొక్క సామాన్యసంఘ సభ 3-1-1935 తేదీన జరిగి చేసిన తీర్మానములు:-

I ఆంధ్రదేశమందు ఇప్పుడున్న జిల్లా, తాలూకా, పట్టణ గ్రంథాలయసంఘములు ఇంకను ఎక్కువగా పనిచేయులాగున చేయుటకును, లేనిచోట్ల క్రొత్త సంఘములు పెట్టుటకును వెంటనే పూనుకొనవలెను.

II ఈ సంఘకక్షమున ఈక్రింద వివరించిన స్థలములందు గ్రంథాలయోద్యమ వ్యాపన విషయమై పనిచేయుటకు ఈక్రింద వివరించిన వారు అంగీకరించినందున, పనిచేయుటకు వారికి అధికార మియ్యడమైనది.

౧. పాతూరి నాగభూషణరావుగారు — దుగ్గిరాలప్రాంతం

౨. వావిలాల గోపాలకృష్ణయ్యగారు — సత్తెనపల్లి తాలూకా

౩. తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రిగారు — మంగళగిరి ఫిర్కా

౪. పుణ్యమూర్తుల రాజశేఖరంగారు — వాడపల్లిప్రాంతం

౫. కస్తూరి కటుంబరావుగారు — రేపల్లెతాలూకా

౬. మల్లెల శ్రీరామమూర్తిగారు — బెజవాడ పట్నము

III అవసరమైనచోట్ల గ్రంథాలయోద్యమ విషయమై పనిచేయుటకు ఇతరులకుగూడ అధికార మిచ్చుటకు అధ్యక్షులవారిని కోరడమైనది.

# కీ॥ శే॥ యీడూరు రామచంద్రారెడ్డిగారి స్మారక పఠనమందిరము

## ముత్తుకూరు.

ఈ గ్రామము నందు గొప్పవ్యక్తిగను, గ్రామమునసబుగను, పంచాయితీకోర్టు, ఫారెస్టు పంచాయతీ, కో-ఆపరేటివు యూనియన్ సంస్థలకు ప్రెసిడెంటుగను జిల్లాబోర్డు మెంబరుగను నుండి మిగుల యశమును గాంచి 8-8-34 తేదిని అకాలమరణముచే దివంగతులైన ము-గా-రా శ్రీ యీడూరు రామచంద్రారెడ్డిగారి స్మారక సభ 19-8-34 తేదీన జరుపబడెను. కీర్తిశేషులగు రెడ్డిగారి స్మారక చిహ్నముగ పఠనమందిర మొకటి నిర్మింపదలచి గ్రామస్థులొక సంఘ మేర్పరచిరి. అనుపతికి తూర్పుగా సుమారు య. 50 ట్ల భూమిని పఠనమందిరమునకుగాను భూస్వాములగు శ్రీయుతులు రావూరు సుబ్బారామిరెడ్డి, కాకుటూరు రాఘవరెడ్డి, కా॥ సీతారామిరెడ్డి, నాద రామలింగారెడ్డి, సుందరరామిరెడ్డిగార్లు 14-9-34 తేదిని దానపత్రమును రిజిస్టరుచేసి ప్రస్తుతపఠనమందిర నిర్మాణకార్య నిర్వాహక సభ్యులగు 1 కా॥ రాఘవరెడ్డి, 2. శ్రీ గిరిరాజు వెంకటరత్నం, 3. ముత్తుకూరు ఆదిశేషయ్య, 4. కా. సుందరరామిరెడ్డి, 5 రా. సుబ్బారామిరెడ్డి, 6. వేమిరెడ్డి శేషారెడ్డిగార్లకు స్వాధీనము చేసినారు. మందిరనిర్మాణమునకై గ్రామస్థులెల్లరు విరాళముల నొసగుటకును ఇతరులనుండి వసూలు చేయుటకును, వాగ్దత్త మొనర్చియున్నారు. ఈకార్యసహాయార్థమై యీ గ్రామ 'శ్రీ సుజనవిలాస సభ' వారు 21-9-34 తేదిని చిత్రనళీయనాటకమును ప్రదర్శించిరి.

---

# దివంగత

## బి. మునిసామినాయుడుగారికి స్మారక చిహ్న నిర్మాణము

### అధ్యక్షుని విజ్ఞప్తి

స్వర్గీయ దివాన్ బహద్దరు బొల్లిని మునిస్వామి నాయుడుగారు ప్రఖ్యాతాంధ్రనాయకులు. మద్రాసురాష్ట్ర రాజకీయవేత్తలలో సుప్రసిద్ధులు. అధికార అనధికార జీవనములలో తమ సేవవలన ప్రజాభిమానమును చూఱగొన్న సాధకవతంసులు. కర్మకులచూడామణి.

పరమపదించినా డీనూనమున. వారియకాల మరణమునకు మద్రాసురాష్ట్రమంతయు ఎలుగెత్తి యేడ్చినది. వారి రాజకీయజీవనమును, నయవర్తనమును, రైతుజన బాంధవ్యమును ముక్తకంఠమున ప్రస్తుతించినది. నిష్పాక్షికమగు నీ సంతాపమున కులభేదముగాని, రాజకీయ మత విభేదముగాని లేకుండ, సర్వసంఘములు, సకల రాజకీయపక్షములు వారిసేవను కొనియాడి, వారియాత్మశాంతికి భగవంతుని ప్రార్థించినవి. నేటికిని రాష్ట్రమంతయు నాదుఃఖమున దోగాడుచున్నది. ఆయన చరితార్థుడైనాడు. తన జీవనసూత్రములను తుదివరకు సాధనజేసి వానికై మరణించినాడు.

నాయుడుగారి మరణము రాష్ట్రీయరాజకీ

యాభివృద్ధికి మహోనర్థకమని రాష్ట్రీయనాయకులు పలుకుచున్నారు. అంతియేకాదు. దాని వలన కమ్మమహాసంఘమునకు తీరనికొఱత వాటిల్లినది. రాష్ట్రీయరాజకీయములందువలెనే సాంఘికవిషయమునకూడ వారు లేనిలోటు ఏనాటికిని తీరుట దుష్కరము. వారు తమ విద్యావివేకసంపదలచే కమ్మమహాజనులకు గావించిన సేవ, కలిగించిన, గౌరవము అపారము, అమేయము. కమ్మసంఘ మెన్నితరములకైన నాయడుగారి ఋణమును తీర్చుకొనజాలదు. ఆ ఋణమును దీర్చుకొనుటకై వారెంతపాటి త్యాగము చేసినను అది అల్పమే?

నాయడుగారికి సాంఘికుల విద్యావికాసము పట్ల గల ప్రేమ నిరుపమానము. ఆకోరికను పదవ కమ్మమహాజనసభ కధ్యక్షత వహించి అంగలూరులో సంఘీయులకు స్పష్టపరచియుండిరి. నాటికి నేటి కది సరస్వతీ ప్రసన్నముగానే యున్నది.

శ్రీవారి ఆత్మశాంతి నభిలషింపగోరువారెల్లరు వారికోరిక మేరకు లక్షరూప్యములు కమ్మబీదబాలుర విద్యానిధికొరకు సమీకరించుట ప్రథమ కర్తవ్యము.

తరువాత రైతుసంఘక్షేమముకొరకు దీనకృషీవలస్వత్వసముద్ధరణముకొరకు, ఆత్మలాభాధికారములు చూఱవెట్టి వారు గావించిన సేవకు కృతజ్ఞతాసూచకముగా నొక స్మారకచిహ్నమును నిర్మింప ప్రయత్నించుట రైతుల పరమధర్మము. దీనిలో జాతిమతభేదము లేకుండ మదరాసురాష్ట్రప్రజ లందరు తమయథాశక్తి కృషి సేయవలసియున్నది. ఈమహాత్కార్యమునకు కమ్మసంఘీయుల బాధ్యత అవిలంఘ్యము.

విద్యానిధి ప్రోగుచేయుటకును, స్మారకచిహ్నమును నిర్మించుటకును గతవారము మద్రాసులో సమావేశమైన కమ్మమహాసభవారు నిర్ణయించిరి. స్మారకచిహ్ననిర్మాణసంఘము ఏర్పరుపబడినది. పని ప్రారంభింపబడి జరుగుచున్నది. వారు పరమపదించిన పిదప ఆరుమాసములు తిరుగులోగా వారికి ప్రత్యామ్నాయముగా నీ స్మారకచిహ్నమును నిర్మించి, విద్యానిధిని సమకూర్చి, భావిసంతానమునకు కానుకగా వారి అమోఘసేవను చిత్రించి పెట్టుటకు సంఘము వారు తీవ్రముగా కృషి సేయుచున్నారు.

కావున, మదరాసురాష్ట్రప్రజ లెల్లరను ముఖ్యముగా కమ్మసంఘీయులు, ఈ స్మారకచిహ్న నిర్మాణమునకు, విద్యానిధిని ప్రోగు చేయుటకు, తనుధనబలముల తోడ్పడగలందులకు ప్రార్థించుచున్నాను. తమకొరకై, తమ స్వత్వగౌరవములకొఱకై మరణించిన నాయుడుగారి కీర్తికాయమును మహోజ్వలమును గావించుట రైతుమండలి పరమధర్మమని మరొకమారు హెచ్చరించుచున్నాను.

దీనికై ప్రోగుచేయబడుధనము, ఉత్తర ప్రత్యుత్తరములు వారికి పంపబడవలెను.

జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి, యం. ఎల్. సి.
అధ్యక్షుడు.

మునిసామినాయడుస్మారకచిహ్ననిర్మాణసంఘము,
గుంటూరు.

---

# ఏలూరు గోసంరక్షణ సమితి.

(స్థాపితము 1918 సం॥)

## 1934 సం॥నకు బ్యాలన్సుషీటు.

| జమ. రు. | | | |
|---|---|---|---|
| **25879- 8- 3** శాశ్వతనిధి ధర్మం | | ఏలూరు వవరుపేట, దంటగుంటల బాపులపాడు, బెజవాడ గ్రామములలో ఇళ్లు, కొట్లు, భూములు | 5273-11- 5 |
| **9286-15- 2** నికరాదాయము | | స్వాధీన తనఖాలు | 2346 -5-10 |
| **750-11- 5** లోకుల కివ్వవలసినది | | శాశ్వతసభ్యులు ఇవ్వవలసినది | 418-12- 4 |
| | | ప్రాంసరీనోట్లు వగైరా బాకీలు | 4851- 5- 1 |
| | | చిల్లరబాకీలు | 887- 0- 0 |
| **35917- 2-10** | | | 35917-2- 10 |

N. B:—గోశాలల నిమిత్తం చేయించిన టిన్‌షెడ్సు 2 గాక పశువులు నిల్వ 71, వరిగడ్డిబండ్లు నిల్వ 50.

## ఆదాయము. (1934 సం॥)

| జమ రు | |
|---|---|
| 1234- 2-11 | (1) వడ్డీలు. |
| 921-10- 8 | అద్దెలు. |
| 347-11- 0 | నెల చందాల ధర్మం. |
| 306- 1- 2 | కమీషన్ కొట్ల ధర్మములు. |
| 172-10- 3 | బట్టల అమ్మకం ధర్మములు. |
| 48- 0- 0 | పేడఅమ్మకం |
| 24-10- 0 | దంటగుంటల భూమికౌలు. |
| 49- 0- 0 | గోవుల ధర్మం. |
| 50- 0- 0 | రైల్వేస్టేషన్ మాష్టర్లు. |
| 19-11- 6 | మోటమర్రి సీతారామయ్య, పెంటపాటి వరహాలు గార్లు కంట్రాక్టర్లు, జూట్ & కాటన్ మిల్సు Co, Ltd. ఏలూరు. |
| 10- 4- 0 | ధర్మం |
| 3183-13- 6 | జమ్మ కెరశి. |
| 2645- 2- 3 | ఖర్చు. కెరశి. |
| 538-11- 3 | గాక నిల్వ-నికరాదాయం (ఏలూరు గోసంరక్షణ సమితి కౌతాకు చేర్చబడమైనది.) |

## (వ్యయము. 1934 సం॥)

| | |
|---|---|
| బీడు భూమికౌతా (గత సం॥ రు 400/—లు సహా) | 669-10-8 |
| జీతాలు ... ... | 681-9 -2 |
| తవుడు ... ... | 219-12-3 |
| వరిగడ్డి ... ... | 474-11-6 |
| పెసర నున్ని ... ... | 165- 5-0 |
| ప్రింటింగు, సంవత్సర రిపోర్టులు ... | 108-13-0 |
| సాదరు చిల్లర పద్దులు ... ... | 98- 5-9 |
| సంవత్సరోత్సవము ... ... | 58- 8-9 |
| చనిపోయిన గోవులు (పాతిపెట్టినందుకు) | 68- 6-0 |
| పన్నులు ... ... | 71-12-5 |
| అడ్వర్టైస్‌మెంటు ... ... | 23-12-0 |
| పోస్టేజి ... ... | 4- 7-9 |
| ఖర్చు కెరశి. | 2645- 2- 3 |

☞ పూర్తి వివరములు, సంవత్సర రిపోర్టులద్వారా తెలియ పర్చబడును.

ధర్మములకు రశీదులును శాశ్వతనిధి ధర్మములకు రశీదులతోసహా పట్టాలును ఇవ్వబడును.

ఇతర వివరములకు:—రా॥ బ॥ మోతే గంగరాజుజమీందారుగారు (ప్రెసిడెంటు)

మద్దుల వెంకట చినరాజుశ్రేష్ఠిగారు (వైస్ ప్రెసిడెంటు) పోలిశెట్టి గోపాలస్వామిశ్రేష్ఠిగారు (సెక్రటరీ)

ది 7—1—1934.